...న్నారణ చేయునపుడు గ్రంథకర్త హృద
...యమున ఉప్పొంగిన భావములు చదువు
...వారికంటె వినేవారికి ఎక్కువ ఆహ్లాదకరముగ
...ండును. "దైవమహిమ" గల దివ్యపురు
...డు కథానాయకుడు. అమానుషమైన
...మహిమచర్యలు నాటకమునకు వస్తువు. స్వర్గ
...మునుంచి వచ్చే నారదుడు, అన్నిచోట్లను
...బడే కృష్ణుడు, తులసీదళమాహాత్మ్యము,
...వన్నీ పురాణ సంప్రదాయములో పెరిగిన
...ప్రేక్షకులకు చక్కగా రుచించును. పామర
...పండిత భేదము లేకుండా అందరికి ఆబాల
...గోపాలము ఈకథ తెలిసినదే. ఇంద్రశచీదేవు
...ను భంగపరిచియైనా పారిజాతము తెప్పించు
...నగలిగిన సత్యభామకు పూర్వము కంటె
...ఎక్కువగా గర్వము ఉద్రేకించుటచేత, ఆమె
...త్మని గోరు శ్రీకృష్ణునికి ఒకవైపు, లోక
...నుగ్రహమే ప్రధానకార్యముగా పెట్టు
...కొనిన నారదునికి ఒకవైపు, సత్యభామాగర్వ
...భంజనము ఆవశ్యకమైనది. ఇందుకు ఆమె
...సవతి రుక్మిణి సాధనమాయెను. దానాన
...మము నారదునినుంచి భర్తను తిరిగి సంపా
...దించుటకు మార్గము కనబడనందున కలవర
...పడి కొట్టుకొనుచున్న సత్యభామ శ్రీకృ
...ష్ణుని ఆదేశానుసారముగ రుక్మిణిపాదములపై
... శిరము వేడవలసివచ్చినది. తాను
...చేసిన స్వర్ణవజ్రమాణిక్యములకు సరితూగని
...కృష్ణుడు రుక్మిణి వేసిన ఒక తులసీదళమునకు
...తూగగా సత్యభామకు సిగ్గువచ్చినది. ఈకథ
...లను ప్రేక్షకులమనస్సులను ఆకర్షించుటకు.

శ్రీకృష్ణనటుని చూచి పరవశులై, అతనిపాద రజస్సు శిరస్సునధరించుటకుఉద్యుక్తులగుపుణ్యా రుషులు నాటకశాలలలో ఉన్నప్పుడు, హర్ష ధ్వనులకు ఏమి కొదవ? తులసి అదృష్టమేమో కానిఅన్నిమతముల వారికిశైవవైష్ణవస్మార్తుల కందరికి పుణ్యప్రదమగుటచేత, దానిమహాత్మ్యమును చూచే రుక్మిణీపతి.పాతురీ నాటకమాడుచున్నప్పుడు పారవశ్యము పొందరా? ఇట్టికథను ఎంచుకొనిన కవి గొప్ప అదృష్టవంతుడు. అందుచేతనే అన్నివిషయములలోవలె నాటకవిషయములో కూడా మనము పురాణయుగమును దాటలేదని ఒప్పుకోవలసియున్నది. పాశ్చాత్యదేశమున నాటకారంభదశలో ఉద్భవించిన మహిమల నాటకముల*వంటి నాటకములు మన వాఙ్మయమున ఇప్పటికి రాజిల్లుచున్నవి. వాటినుండి నీతులను సంగ్రహించి, కథాపురుషులను దేవులుగ ఆరాధించి, కథాచర్యలను ఈశ్వరమహిమలుగ భావించి ఆనందమగ్నులగుచు నాటకమును మెచ్చుకొనే ప్రేక్షకులు పురాణయుగమును దాటినవారు కానుగదా. ఇట్టి కథ ఈరోజులలో సులభముగా రంగస్థలమున సంతోషపెట్టును. ఇక, రంగస్థలమందు ఏర్పాటులు, తెరలు, వేషములు, నటుల రూపురేఖావిలాసములు, రంగమున జూపుసామగ్రి దీపములు,—ఈమొదలైనవి ప్రేక్షకులను రంజింపచేయుటకు తగినసాధనములు. అందుచేత ప్రదర్శనమున నాటకము బాగా ఉన్నదన్నంత

* Of Mystery and Miracle plays

మాత్రాన సారస్వతమునకూడా బాగాఉన్నదని అంగీకరించినట్లే కానేరదు.

కాని సారస్వతమునకు ఉపచరించేటట్లు రచింపబడెనని గ్రంథకర్త ప్రయత్నించినట్లు వారి యుపోద్ఘాతమువల్ల తెలుస్తూఉన్నది. పాత్రపోషణ నాటకమునకు ముఖ్యము. నాయకుని పాత్రపోషణ విషయమై కవి చాలా శ్రద్ధ వహించినట్లు వ్రాసియున్నాడు. అంతేకాక తన గ్రంథమును పఠనీయపుస్తకముగా విశ్వవిద్యాలయమువారు నియమించేటట్లు ప్రయత్నిస్తూ ఉన్నారు. నాటకరచనలో కూడా అట్టిపూనిక చూపి ఉంటారని మనమూహించగలము.

ఈ నాటకకథకు మూలము లోకమే కాబోలు. దీనిని ఎక్కడనుండి సంగ్రహించెనో కవి చెప్పలేదు; పటావలోకము అతనిని పురికొల్పినట్లున్నది. అందుచేత కవి స్వతంత్రకల్పన లేవో, మూలమునుండి గ్రహించినవేవో నిర్ణయించి చెప్పుటకు ఆధారము లేదు. కాని ఈ కథాభాగములు అనగా దేవేంద్రుని కథలోనికి తెచ్చుట, కృష్ణుని కోపమునకు కారణము కల్పించుట, కథనుండి గ్రహించినరీతి, ఇవి లోకములో ఉన్నకథలో ఉన్నట్లు తోచదు. సత్యభామాగర్వోద్రేకమువల్ల రుక్మిణి, గోపికలు, లోకము, తుదకు కృష్ణుడు కూడా వ్యథనొందినట్లు చెప్పితేనే కాని సత్యభామాపరాభవమునకు కృష్ణుడు సర్వాంగీకారము ఇచ్చినట్లు వర్ణించుట సమంజసముగా ఉండదు. అలాగు మొదటిఅంకము అవశ్యకమే. తనతో కలిసి వెన్నెలరాత్రిని గడుపుటకు కృష్ణుడు ఇంకా రాలేదేమని రానంతసేపూ వగస్తూతీరా వచ్చినతరువాత బెట్టుకొరకు అతనిని నిరాకరించిన సత్యభామపై కృష్ణునికి కోపము వచ్చుట సహజమే. సత్యభామాగర్వాతిశయము యొక్క పరిమితి చూచుటకు ఈ భర్తృనిరాకరణము ఒక చక్కనిమానము. నారదుని పన్నుగడకు కృష్ణుడు ఏల సహకారి అయినాడో ఈ అంకములోని కథవలన తెలియుచున్నది. మొదట అంకములోని కథ వలెనే రెండో అంకములోని కథకూడా కవి యొక్క కల్పన అని నాయూహ. పారిజాతాపహరణమువలన సత్యభామపై శచీంద్రులకు గల అసూయను చూపి, ఇట్లు అన్నిలోకములలోను ఆమె గర్వోద్రేకము ఎట్లు ప్రబలియున్నదో సూచించి, ఆమె గర్వభంగమునకు ఏర్పరచిన పన్నుగడపైగాని, నారదునిపైగాని మనకు ద్వేషము కలుగకుండా మన భావములను సరిపెట్టుటకా? లేక శచీంద్రులకు వారిద్వారా మనకందరికిన్ని కృష్ణుని మహత్వమును రుజువుచేసి, వారిపై ఉన్న స్త్రీలోలత్వనిందను పోగొట్టుటకా, ఈ రెండో అంకములోని కథాభాగము? శచీంద్రుల సంభాషణవలన సత్యభామాగర్వము, కృష్ణుని స్త్రీలోలత్వము ద్యోతితములగుచున్నవి. ఈ కథే కాకుండా కృష్ణలీలలవర్ణనకూడా ఈ అంకములో ఉన్నది. కాని గర్వభంజన కథకున్ను ఈలీలకున్ను సంబంధము కనబడదు. రెండో అంకములో ప్రారంభమైన ఈ చిక్కు నాటకమునంతా ఆవరించినది. మూడు, నాల్గు

ఐదు అంకములలోని కథ, అనగా భర్తృదానోపదేశము, ఆ వ్రతము, తులాభారము, భర్తృసంపాదనము, ఈకథ క్రమముగా నడచును. ఇదంతా గర్వభంజనకథాభాగమే కదా!

గర్వభంగనిరూపణము, స్త్రీలోలత్వఖండనము, ఈ రెండింటిలో ఏది ఈనాటకమునకు ప్రయోజనము? ఒకటా, అయితే ఏది? రెండు, అయితే ఏకత ఎట్లు కుదురును? గర్వభంజనమునే కవి లక్ష్యమందుంచుకొనెనని చెప్పలేము. "పామరులు భగవద్గీతా సంప్రదాయము తెలియనివారు శ్రీకృష్ణుడు కేవల * మింద్రియలోలుడని తప్పభిప్రాయము పడుచున్నారు. బాగుగ నాలోచించినచో అట్టి యభిప్రాయమునకు దగిన * ఆధారము లేదు. * వేదాంతవేద్యుడై శ్రీమత్ భగవద్గీతోపదేశకుడైన శ్రీకృష్ణుడు స్త్రీలోలుడగునా? ......నాశక్తికొలది శ్రీకృష్ణుని దైవమహిమకుచితమగు పాత్రపోషణ చేయుటకు ప్రయత్నించితిని." అని కవి తనపీఠికలో వ్రాసియున్నాడు. ఈవిషయమునే నాటకములో కూడా అక్రూరకృష్ణుల నారదేంద్రుల, కృష్ణనారదుల సంభాషణలలో ఉటంకించడమైనది. నాటకపర్యవసానమున వచ్చినఇంద్రునికి ఈ ప్రశ్న వేసే నారదుడు చెప్పినాడు. ఈ హేతువులనుపట్టి కవిహృదయములో ఈవిషయము ముఖ్యముగా భాసిల్లెనని చెప్పకతీరదు. ఈ ప్రయోజనము లోకవిదితమైన తులాభారకథకు ఉన్నట్లు కనబడదు. అందుచేత ఈమార్పు కవి చేసెనని చెప్పకతీరదు; అలాగని దీనినే నాటకప్రయోజనముగా ఉంచలేదు. రెండున్నప్పుడు వాటికి సంగతి యెట్లు? ఒకటి ముఖ్యము, ఒకటి గౌణము అందమా? అన్నా సంగతము కాదు గదా! ప్రేక్షకుల రంజనకొరకనిగాని నారదుని సంతోషపెట్టుటకని గాని లీలలు ప్రయోజనము చెప్పితే, నాటకరచనకు లోపము అంగీకరించినవార మగుదుము. ఒకమారు నిరాకరించినంతమాత్రాన సత్యభామకు కృష్ణునిపై మోహము లేదని ఎట్లు వాదించలేమో, అట్లే ఒకమారు పరాభవించుటచేత భామపై కృష్ణునికి లోలత్వము లేదని ఎట్లు వాదించగలము? అంతే కాక, భామపై గల అనురాగాతిశయముచేతనే లోలత్వభ్రమ లోకములోని పామరులకు కలుగలేదు. భార్యలే కాక వేలకొలది గోపికలు, అప్సరసలు ఉన్నారు కదా! లోలత్వఖండనకు తులాభారకథ చాలదనే లీలలు ఆవశ్యకమైనవా? లీలలే ముఖ్యమైనప్పుడు నాటకముకొరకు ఈకథనే ఎంచుకొనుటకు సారస్యము చాలదు.

ఈ చిక్కును దాటుటకు ఇట్లు ఉపపత్తి చెప్పవచ్చునేమో విమర్శకులు ఆలోచింతురు గాక! భామను స్త్రీజాతికి ఉదాహరణముగా

* "కేవల" "తగిన" అనేమాటలను ప్రయోగించుటలో అభిప్రాయమేమైనా ఉన్నదా? కేవలము ఇంద్రియలోలుడు కాకున్నా, కొంతవరకైనా అనవచ్చని అంగీకరింతురా? తగిన ఆధారము లేకుంటే ఎటువంటిదైనా ఉన్నదా? ......వేదాంతులైనవారు స్త్రీలోలురగుట అసంభవమా? "వేదాంతవాక్యంబులు వేరు; ప్రవర్తనా చాకచక్యంబులు వేరు" అని కవే చెప్పించియున్నాడు. లోకములో ఇందుకు ఉదాహరణములు లేవా? ఈలోకనిదర్శనము కృష్ణునికి వర్తించదనా? సత్యభామాకోపలన ఈ యభిప్రాయము నిరసింపబడునా?

చేసి, ఆమె పరాభవమును ఆజాతికంతటికి చెందజేసెదమా? లేదా, లోలుడైనవాడు పరాభవింపబడుననే వ్యాప్తిని సిద్ధపరుచుకొని సత్యభామనే పరాభవించినవాడు లోలుడు కానేరడని చెప్పవీలుండునా? లేదా, లీలలచే దైవమహిమ సాధించి, అట్టి మహాత్వము కలవాడుగనుకనే తులలో చిత్రమును చేయగలిగినాడని చెప్పి, తులాభారకథకున్ను లీలకున్ను సంబంధము కల్పించగలమా? దేనినో ఒకదానిని అంగీకరించక తప్పదు. ఏదైనా డొంకతిరుగుడు సమాధానమే కదా!

ఇంకొక ప్రశ్న, ఈకథకు ముఖ్యులెవరు? కృష్ణుడా? భామా? స్త్రీలోలత్వఖండనమే ప్రధానమైనచో కృష్ణుడు ముఖ్యుడగును; గర్వభంగమే ప్రధానమైనచో భామముఖ్యయగును; ఇద్దరూ ముఖ్యులు కారుగదా. ఇక ఎట్లు?

ఇంతవరకు నాటకప్రయోజనమును విచారించితిమి. ఇక పాత్రపోషణగురించి కొంచెము ఆలోచించెదము దానిగురించి చాలా శ్రద్ధతీసుకొనినట్లు కవి తనపీఠికలో తెలియజేసెను. లోకసిద్ధమైనకథలోని పాత్రలు, వారి శీలవిధానము లోకములో చాలావరకు సిద్ధమే కదా! సత్యభామ, ఆమె శృంగారవిలాసములు, ఆమె టక్కు, బెట్టు, గర్వము; రుక్మిణి, ఆమె భక్తి, ఆమె వినయము; నారదుడు, వాని కలహప్రియత్వము, మాయలు, భక్తి; ఎందులోను ఏదివిషయమై విశేషము కానరాదు. కాని రుక్మిణియొక్క ఆత్మ పక్వమైనదా అనే సంశయము కలుగుచున్నది. కృష్ణుని దేవునిగ తెలుసుకొని, అతనియందు అద్వితీయ భక్తిని గల ఆమె త్రాసులో తులసివేయుటకు వచ్చి, భామను కసిలీరా తూలనాడుటలో ఆమె గొప్ప హృదయమునకు ఔదార్యగాంభీర్యములకు ఒక కళంకము వచ్చినట్లు అయినది. చూడండి ౯౮, ౯౯ పుటలు. సుందరి కుముదలకు గల తారతమ్యమును శీలభేదమును కొనవరకు చక్కగా నిలిపి యుంచుట ఒక మంచిసంగతి.

కృష్ణుని దైవమహిమను, భక్తపరాయణత్వమును, దుష్టదండనశీలమును వ్యక్తపరుచుటకు కవి ఉద్దేశించినాడు. కాని లోకులు ఈ గుణములను, అనగా ఈశ్వరాంశములైన ఈ గుణములను మనుష్యస్వభావముతో మేళనముచేసి కృష్ణుని భావిస్తూ ఉంటారు. అట్టి మేళనమును కవికూడా మాన లేదు. ఒకమారు సాధారణమనుష్యునివలె ఒకమారు ఈశ్వరునివలె ప్రవర్తించుటలో కలిగే విరోధమును పరిహరించుట ఎట్లు? మొదటి అంకములో కృష్ణుడు మనుష్యుడు; అక్రూరునికి తత్వము బోధపరిచినంత మాత్రాన ఈ శృంగారపురుషుడు మనుష్యుడు కాక ఈశ్వరుడెట్లు అగును? సాధారణ స్త్రీలోలుడు శృంగారబాధలకు ఓర్వజాలక తనవలపు స్త్రీకొరకై చూపు దైన్యమంతా కృష్ణుడు కూడా వెలిపుచ్చెను. భామ నిరాకరణచేత వచ్చిన కోపముయొక్క ఫలమే గర్వభంగప్రయత్నము. అక్రూరసత్యభామా స్వప్నముల అర్థమేమిటి? కృష్ణుడు మనుష్యుడైనపుడే ఆకలలకు అర్థమున్నది. సత్యభామకు భక్తిపురికొల్పుటే ప్రయోజనమైన ఈశ్వర

ృష్ణుడు పారిజాతమును తెచ్చియిచ్చి ఆమె
ర్వమును ఎందుకు ఉద్రేకించవలెనో?

ఈ ద్వివిధలీలవర్ణనలో ఉండే చిక్కు-
ాటు అటు ఉనిచ్చినచో, కృష్ణుని లీలలవలన
ాటించే భక్తినిగురించి కొంచెము విచారిం
ము. "భక్తికిగదా స్వాధీనుడు ఇతడు" అని
ండీపద్యములోనే ఉండుటచేత భక్తిత
్వము ఈ నాటకమునకు ఒక ప్రయోజన
ని కవి ఆశించినట్లు సూచన అగుచున్నది
భక్తి ఎట్టిది? స్త్రీని శృంగారపురుషుడు
ర్షించి తన్మయత్వము పొందించువిధాన,
ంతుడు తన భక్తులను ఆకర్షించి తన
ందు లయమొందించుననే వైష్ణవమత
ాంతమును కవి ఆమోదించినట్లు కన
ను. ఎట్లనగా, "నేను శృంగారవేషంబున
ామను ఉద్ధరించి వచ్చెద" (పుట ౧౨)
కృష్ణుడు అక్రూరునితో చెప్పినాడు. సత్య
మమెడల చూపిన వాత్సల్యము శృంగార
బద్ధమైన కేళీవిలాసములు కావనిన్నీ,
క్తిశాస్త్ర సమ్మతమైన ఆకర్షణలీలలనిన్నీ
ి కృష్ణుడు చేసినదంతా నటన అని అంగీ
ంచవలెను. చూడండి, "శృంగారవేషంబున"
ఉన్నది. అట్టినటన శిష్యులకు పాఠము
బోధపరుచుటకున్నూ, భక్తులను ఆక
ించుటకున్నూ అవలంబించిన సాధన
ి, అట్టికార్యము లేనప్పుడున్నూ
గా తాను ఒంటరిగా ఉన్నప్పుడున్నూ,
లో తాను ఆలోచించుకొనుచున్నప్పు
న్నా ఆవేషమునే, అట్టినటననే ధరించు
[illegible]

రమణీయుండై హృదయతృప్తిని గాంచి నిదు
మితకాముడై నిలుచుట" అనే సంసారపాఠ
మును అక్రూరునికి బోధపరుచుట ఒకటి,
శిష్యుడు లేనప్పుడు కూడా ఆ ప్రవాహములో
పడి కొట్టుకొనుట ఒకటి. "మోహనాకార
మునుజూచి మోదపడుచుండగా ప్రభువులెల్లను
మోసపోదురహహ; సొంపైనరూపముచేతను
సంతసించె నింపైనమాటచేతను, నెట్టియతివ
మనసైన నను నపహరింతు(ర)" అని భామ వర్ణిం
చిన శృంగారవేషమునకు శిష్యురాండ్రు ఉన్న
ప్పుడే ప్రయోజనముకాని, తాను ఒంటరిగా
ఉండి భామ తనను ఆకర్షించుటకు ఎట్టిఏర్పాటు
చేయలేదని కృష్ణుడు సామాన్యరసికునివలె
విలపించుట యుక్తియుక్తముగా లేదు కదా!
మొదటిఅంకము తుదను ఉన్న కృష్ణవిలా
పమువలన నాటకము వినేవారికి చూచేవారికి
కృష్ణునిస్వభావము ఎట్టిదని తట్టునో విమర్శ
కులు ఆలోచించవలసి ఉంటుంది. తనకు
శృంగారాహ్లాదము కలుగలేదని విలపించ
వలెనా, లేక, తాను శృంగారము చూపి ఆక
ర్షించేసమయము మించిపోయినదని కించపడ
వలెనా? ఎట్టిది తగిన పాత్రపోషణము?
చూడండి. విలాపభాగములలో కొన్ని ముఖ్య
మైనవి. "తనలో" తాను అనుకొన్నవి.
"భక్తుల బాళింప" "దీనుల మొరవిని" "నైవే
ద్యతతిగొన", "దాసులప్రార్థన తలచుట",
"యోగిహృదయబంధిత"—ఈ మొదలైన

"యెన్ని యపరాధములో చేసియుంటిదీర
ఏమిసేయుదు నను భామ యెఱుగనేర."

[illegible] ...న్నాడు. భామ

కడకు రాక పూర్వమే. భామ కనబడిన తరువాత లేక అక్కడ దాగియుండవచ్చునని ఊహించిన తరువాత కనబడిచే శృంగార శోకము సమంజసము. నిరాకరణతరువాత వచ్చినకోపము, కృష్ణుడు చేసిన గర్వభంజనదీక్ష. సామాన్యుల భావములకంటె ఎట్లు అసాధారణములో, ఎట్లు భిన్నములో కవి చూపలేదు. చూడండి. పుట ౨౦ (తెనలో) "నేను బ్రతిమాలినకొలదిని నీమొగర్వ మెంతో హెచ్చుచున్నది? ... యతిశయమున్న దేమొ యనఁగాశ్చైద గర్వితమానసంబులన్" ఈమాటలు భక్తపరాయణుడైన భగవంతునకు ఉచితమైన వైష్ణవసంప్రదాయభక్తిశృంగార చేష్టలా? లే. తాను వలచి ఉన్న స్త్రీ నిరాకరించునప్పుడు ఉద్వేగముపొందు సామాన్య రసికుని ఆశాభంగకోపమా? ఈచిక్కుకు కారణము కృష్ణుని ద్వివిధస్వభావ మేళనము.

ఈ రచనాలోపము లున్నా, కవిఆశయముమాత్రము భక్తినిర్వచనమే అని తెలుసుకొనుటకు సూచన లనేకములు నాటకములో ఉన్నవి. నారదుడు చూచినలీలలవర్ణనలో అట్టిమాటలు దొర్లినవి. రుక్మిణి అత్యంతానురక్త. రాధ అత్యంతభక్త. భామ అత్యంతగర్వాతిశయయుక్త. ఈ సందర్భములో నారదు డన్నమాట ఒకటి ఉన్నది; "ఈ అహంకారము వదిలిననే కాని యామెకు నీ మహిమ గోచరము కాదు." ఇందువలన మరొకసంగతి ఉల్లిఖితమైనది. శరీరసుఖము, ఇహలోకలాభములు— వీటిపై గల అభిమానము పోతేనేగాని ఆత్మానందము, పరలోకప్రాప్తి ఎవరికైనా దొరకవు అనే సామాన్యధర్మమును కవి సూచించినాడా? ఇందుకు రుక్మిణీసత్యభామలుదాహరణములు. కృష్ణుని మోహనాకారశరీరమే సర్వమని భావించిన భామ అతని దైవమహిమను గ్రహించలేకున్నది. సర్వోత్కృష్టమైన సంపద భక్తే అని చూడలేకపోవుటచేతనే భామ ఓడిపోయినది. భక్తి లేని వ్రతము భేషజము. ఆత్మకు శాంతి కలుగనిదీ, మనస్సు పక్వముకానిదీ లౌకిక సామ్రాజ్యమునకు విలువ ఉండదు; అది చక్కగ ప్రాప్తించదుకూడా. అవి ఉన్నప్పుడు గడ్డిపరకకైనా విలువ కలుగును. "భగవద్భక్తులకు వేషములతో పని యేమి?" (పుట ౨). భక్తిమిళితమైన తులసీదళముతో భక్తిరహితమైన బంగారమునకు సాటి ఎక్కడ? భక్తులకు ఈశ్వరుడే స్వాధీనుడగుచున్నప్పుడు, ఇక లోకములో ఉన్నది ఏది స్వాధీనము కాదు? అంతేకాక, ఎట్టిహృదయముగలవారికి అట్టి లోకమే అనుభూతమగును. కృష్ణభక్తితో నిండిన ఆత్మలుగల రాధారుక్మిణీ గోపికలకు ఎక్కడ చూచినా కృష్ణుడే. ఏదైనా కృష్ణుడే? భామకో? బాహ్యసుఖము కొరకే లోలయై యున్నప్పుడు ఆదృష్టి యెట్లు సాధ్యపడును? ఈ ఆధ్యాత్మికతత్వము ఈ కథకు బీజమందామా? అంటే బాగానే ఉంటుంది. ఇదే నాటకప్రయోజనమని ఎందుకు భావించకూడదు? అలాగన్నా నాటకరచనలోను, పాత్రశీలవివరణములోను ఉండి యున్న చిక్కులు పోవు. ముఖ్యగౌణవిభజన చేయుటలోను, అంతటికి ఏకసమన్వయము

...కతి చక్కగ పట్టేటట్లు చూచుటలోను లోప ములను తీర్చవలసి ఉంటుందని నా అభిప్రాయము.

నా విమర్శనకు నాటకరచనవిషయ ...శోధనలే ముఖ్యములు. భాషాశోధనతో ...కు ప్రసక్తి లేకున్నా, పుస్తకములో కొన్ని ...రపాటులు ఉన్నవని చెప్పవలసి ఉన్నది. ...రర లోపములతో పాటు అవికూడా రెండో ...చ్చులో పోతవని నా ఆశ. ముఖ్యముగా సం ...స్కృత ప్రయోగములే మమ్ము బాధించేవి. ...న్నిచోట్ల "ప్రపంచకము" (పుట ౪, ౩౮, ...౬, ౫౯, ౬౯) అనేరూపమే కనబడుతు ...న్నది. 'క' ఎందుకు? అలాగే 'జన్మజన్మేపి' (పుట ౪౫). ఇట్టివి ఇంకా ఉన్నవి. చూడండి ౩ పుట; "కార్యసంయుత పూర్వవృత్తి; అన ...థాసిద్ధ; దైవికకారణ" ఈ మొదలైన తర్కా ...షట మెందుకు అక్కడ?

పద్యరచనగాని, గద్యరచనగాని క్లిష్టమై ...కావు. పద్యములలో గుంఫన చాల ...మో. పద్యములో చెప్పినసంగతిని, దాని ...ందే గద్యలో తిరిగీ ఎందుకు చెప్పడము? ...దీని సంప్రదాయమోగాని ఇప్పటినాట ...ములలో చాలా తరుచుగా కనబడుతుంది. ...దీనాంధ్ర నాటక సంప్రదాయమేమో అని ...శహా. ముఖ్యముగా వినేది చూచేది ...కమైనప్పుడున్నూ, పాఠకులకు సులభ ...గా బోధపడవలెను అన్నప్పుడున్నూ ఈ పునరుక్తి పుట్టి ఉండవచ్చును. వీథినాటక ములు, బొమ్మలాటలు, భాగవతములు, పురాణము చెప్పుట ఈ మొదలైనవి ఇందుకు నిదర్శనములు.

గద్యపద్యములకు ఛందస్సే భేదమా లేక వర్ణనాంశములోను, భావవివరణము లోను, రచనసొగసులోను విశేషమేమైనా ఉన్నదా? ఈ చర్చయొక్క ప్రాధాన్యము ఆంగ్ల సారస్వత సుపరిచయముగల కవికి సులభముగా వచ్చునుగదా! ఐదవ, ౨౭, ౩౦, ౩౫, ౪౨, ౫౦, ౫౮ పుటలలోని పద్యములను చూడండి. ఇట్టివి ఇంకా చాలా ఉన్నవి. పద్యము లెందుకు? ఉంటేనే కాని నాటకము కాదా? సంగీతమునకు స్థానముండ దనా? చక్కని పద్యములు రానపుడు, అక్కర లేనపుడు గద్య ఎంత బాగుంటుంది! తెల్లవారు నప్పటికీ బద్యములు తమంతట దామె కుదిరి మనోగోచరము లగుచుండెను. ఆహా! ఏమి చిత్రము; ఏమి అదృష్టము!.. ఈ నాటకములో ౯౬ పద్యము లున్నవి. అందులో ౧౪ వృత్తములు, ౩౦ సీసములు, ౪౯ గీతములు, ౩ కందములు. పద్యరచనానిపుణతను తెలుసు కొనుటకు ౧౧, ౩౦, ౫౧, ౭౯, ౯౧, ౯౩ పుట లలోని పద్యములను చూడవచ్చును. ఈ భాగ ముతో నా కంతగా ప్రసక్తి లేనందున ఇక ముగించెదను.

---

# రాధవలవంత

మంగిపూడి వేంకటశర్మగారు

గొల్లవారింట నేను రేపల్లెలోను
రాధనై పుట్టకుండ నరణ్యమందు
వెదురుపొదలోనఁ బుట్టిన బ్రదికిపోదు
విరహవేదనలోఁ బడి వేఁగకుండ.
వెదురునై యుంటినా ప్రాణవిభుఁడు నన్ను
వేణువుగఁ జేసికొని యెల్ల వేళలందుఁ
గేలఁ గొని మాధురీగానలోలుఁడగుచు
విడిచిపెట్టక కడు గారవించును గద!
నా విభుఁడు నన్నుఁ బిల్లనగ్రోవిగాను
జేసికొని యూదుచుండిన నాసదీర
వాని కమ్మని కెమ్మోవి యాని చొక్కి
యనవరతానందమున నోలలాడుదుగద!
రుక్మిణీసత్యముఖపురంధ్రులును సతముఁ
బడయఁగా రాని వల్లవీపల్లవేంద్రు
మధురమధురతరాధరసుధను ద్రావి
ధన్యనై మాన్యనై యొప్పుదాననుగద!
అట్టి భాగ్యంబె నిజముగా నబ్బెనేని
మురళిధరు వాతెరను నాతఁ డెఱుఁగకుండ
నల్లనల్లన ముద్దులఁ గొల్లలాడి
యమితసుఖపారవశ్యంబు నందుదుగద!
అట్టి భాగ్యంబె నిజముగా నబ్బెనేని
యష్టమహిషీమణు లసూయ నందకుండఁ
జట్టుపక్కాలు చురచురఁ జూడకుండ
నాకొలమువారు నను జూచి నవ్వకుండ
నళుకులేకుండ బాహాటమై చెలంగ
నా జగన్మోహనాకారు నా మనోవి
హారు నవమారు రామాంతరంగచోరు
స్వేచ్ఛమైఁ గూడి మాడి సుఖింతునుగద!
అహహా! వంశమ! యేపుణ్యమాచరించి
యేమినోములు నోచి నీ వీ ముకుందు
కరుణ కిటు పాత్రమైతివో తెలుఁగఁ జెప్పి
మాన్పవే! నావగపు బలిమాలుకొందు.
నిన్నె యిలవేల్పుగాఁ గొల్తు నీదుకడుపు
నందుఁ బుట్టుదు, నీ పేరె నందనులకుఁ
బెట్టుకొందును, దయయుంచి వేణుధరుఁడు
కై వసంబగు కిటుకేదొ గరపఁగదవె!
వేణువా! నీవు శ్రీవల్లవీవినోదు
వలచియో వశ్యమంత్ర జపంబు చేయు
నట్లు నా ప్రాణసమునిచే నాటకింతు
నిక్కమో కాదో చెప్పవే నిజము నాకు?
తమ్ము ధన్యులఁగాఁ జేయ దయఁదలంచి
కృష్ణభగవానుఁ డవతార మెత్తెననుచు
దేవకీవసుదేవులు దివ్యభక్తి
భరితు లక్రూరముఖ్యులు పాండవులును
అష్టమహిషులు గోపీసహస్రములును
యాదవులు నందుఁడును యశోదాదులెల్ల
నెంతు. రదికల్ల; వీరిలో నెవరికైనఁ
గలదె నీపాటి మేటి భాగ్యంబు వంశ!
రాకుమారుఁడుగద యశోదాకిశోరుఁ
డతఁడె కోరిన బూరల కడ్డమేమి?
మేలిమిపసిండితోఁ జేసి మిసిమి మించు
రతనములు దాపినట్టి బూరాల నిడరె?
శంఖశేఖరమగు పాంచజన్యముండ
ఘనతరధ్వానమొలయు శృంగంబులుండ
వీణాముఖవాద్యములు పెక్కు వెలయుచుండ
నాదరసలోలుఁడగుచు నానందజలధి
నోలలాడంగ నీవె కావలయు నటవె?
నీతపఃఫలమున శౌరి నిన్నె కోరె,
నినుఁ గృతార్థంబుగాఁ జేయ నెంచుదయను
యాదవప్రశస్త్య హారి నిశ్చయంబు మురళి!

ఁ జేసుకొనిరెను. పిదప వారిని శిష్యులందఱు విరక్తి సంసారసంబంధమును శుద్ధముగాఁ బరిత్యజించి తమ వువలె సన్యాసివృత్తి నవలంబించి దేశాభివృద్ధికి తాభివృద్ధికిఁ బాటుపడసాగిరి. వివేకానందుఁడుకూడ రిలో నొకఁడు. ఇద కతఁడు వేదాంతమును బ్రజలకు ధించుచు మతమునే దేశమునం దెల్లెడల వ్యాపింపఁ యుట తనజన్మమునకు ముఖ్యప్రయోజనముగాఁ బరిగ్ర హించెను. కొంతకాలము తనసహోధ్యాయులతో నిట్లు సి పనిచేసికొన నీశ్వరోపాసనమునకు మోక్షశాస్త్ర ్యసంగమునకు విజనప్రదేశవాసము ముఖ్యోపాయ ని తలంచి హిమాచలమునకుఁ బోయెను. టిబెటుదేశ మునకుఁ జని యచట గొన్నాళ్లుండి బౌద్ధమతమునఁ గృషి చేసెను. అదిమొదలుకొని హిందూదేశమం దంతటఁ బ్ర యాణములఁ జేయ నారంభించెను. మొదట ఖేత్రీనగ రమున కరిగి యాపురము నేలు మహారాజును దనమతము లోఁగలిపికొని యచటనుండి పశ్చిమసముద్రతీరమందున్న రువనంతపురము మొదలగు ప్రదేశములు చూడఁబోయెను. చట వాసి చెన్నపట్టణమునకుఁ జేరెను. ఆయాయిప్రదే శములయందున్న దినములలో భరతఖండనివాసు లగు వారలకు వేదాంతశాస్త్రసిద్ధాంతములను దివ్యజ్ఞానసంప న్నులగు ప్రాచీనబ్రహ్మఋషుల మాహాత్మ్యమును వారి కాలమందు భరతవర్షముయొక్క ఉన్నస్థితిని హృదయా ర్ద్రమగు వక్తృత్వశక్తితో బోధించెడివాఁడు.

## అమెరికాదేశప్రయాణము

ఈతఁడు చెన్నపట్టణములోనున్న సమయమున చ్చటి విద్వాంసులగు కొందఱు పెద్దమనుష్యు లొకసభ చేసి అమెరికాదేశమందుండు చికాగోనగరములో నానా మందుజరుగనుండిన(Parliament of Religions) పార్లమెంటు ఆఫ్ రిలిజియన్సు అను మత సంబంధమైన పెద్దసభ కీతఁడు పంపఁబడ నర్హుఁడని నిశ్చయించి చందారూపముగా గూర్పఁబడిన కొంత ధనము నీతని కొసంగి అమెరికాకుఁ బంపిరి. స్వామి అమెరికాలో నడుగిడునప్పటికిఁ జేతిలోనొక్కకాసుండదయ్యె చలి బాధచే నిస్సహాయుఁడై దుఃఖకరమైన స్థితిలోఁ బడెను. అట్టియిక్కట్టులో నవ్వేళ మనస్వామి నాడు కొని సహాయము చేసిన యొకయమెరికాదొరసాని సహాయమై హిందువులయినవారందఱుఁ గృతజ్ఞులయియుండవలసినవారము.

ఆమె యతని వింతయగువస్తువుగాఁ దనవారికందఱికిఁ బ్రదర్శింపఁజొచ్చెను. తనమిత్రులగు కొంతమందికి విందు చేయఁదలంచి స్వామినికూడ వారితోఁ బంక్తిభోజనము నకుఁ బిలిచెను. భోజనసమయమం దీతఁడు పంక్తిలోఁ గూర్చున్నవారందఱు మెచ్చుకొని యాశ్చర్యపడునట్లు సహజమయిన వాగ్మిత్వము వెల్లడి చేయుచు పలువిధ శాస్త్రసాంశములగుఱించి సంభాషింపఁ దొడఁగెను. విద్వజ్జనులే తెలిసికొనఁగల భావగర్భితములగుగంభీరవాక్యా లతో హిందూవేదాంతము నుపన్యసించినప్పు డచటి వా రందఱు ప్రతిపాదితాంశములను గ్రహింపఁజాలక చిత్తరు వులోఁ వ్రాయఁబడిన ప్రతిమలవలె నిశ్చేష్టులై రెప్పవేయక యతనివైపు చూచుచు నిలిచియుండిరి. అపు డొక పండితుని నతనితో వాదమునకుఁ దగిలించిరి. సుగ్రాహ పారీణుఁడగు నాపండితుఁడు క్షణములో నీతనియంతస్సా రమును గ్రహించి జరుగఁబోవు పెద్దసభ కగ్రాసనాధిపతి యగు (Barrow) బార్రోదొరగారియొద్దఁ బ్రవేశపెట్టె ను. అప్పు డాదొర సభలో హిందూమత ముపన్యసింపుమని యతని నుపన్యాసక సంఘములోఁ జేర్చెను. అట్టి గొప్ప సభలో మనస్వామి యుపన్యాసకుఁడుగాఁ గానవచ్చుట సకలజనులకు మహావిస్మయమును బుట్టించెను. పాశ్చా త్యులచూపునకుఁ జోద్యముగాఁ గానవచ్చు కాషాయ వస్త్రముల ధరించి యున్నతాసనము నధిష్ఠించి హిందూ వేదాంతమతమే జగత్తునం దుండెడు నితరమతములకంటె సారతమమయినదని యుక్తులచే సమర్థించి మేఘస్తనిత గంభీరమగు కంఠధ్వనితో నుపన్యసింపఁగా నతివిశాల మగు నాసభారంగమంతయు మంత్రించినట్లు మత్తుమందు చల్లినట్లు, తరంగధ్వని లేని సముద్రమువలె నిశ్చలముగాఁ గన్పట్టెను. ఇతని యుపన్యాసము ముగిసినతరువాత "ఇట్టి వాఁడు కూర్చున్న మన్నాడా" యని కొందఱు, "ఇట్టి విద్వాంసులున్న హిందూదేశమునకు మతమునేమ బోధింప మిషనరీలను బంపుట మన ఎంతయవివేకపుఁబని" అని మఱికొందఱుఁ దమలోఁ దాము ననుకొనిరి. అమెరికాలోఁ బ్రకటింపఁబడు వార్తాపత్రికలన్నిటిలో నీతనిప్రశంసయే శ్లాఘింపఁబడెను. అమెరికాఖండముయొక్క అన్నిభాగ ములనుండి మతోపన్యాసములకు రమ్మని యతనికాహ్వాన పత్రికలు వ్రాయఁబడెను. అమెరికాలో నున్నంతకాల ము వేదశాస్త్రమాహాత్మ్యమే సుద్ఘోషించుచు, తర్కేంద్రి

కిందిజాతివారివిషయమును ప్రవర్తింపరాదు. హిందూ దేశమందుండెడు రక్కసజాతులవారికి సద్గుణము బాహ్యులకాయుండున్నది." అని యిట్లు బ్రాహ్మణులకు బ్రాహ్మణేతరులకు బోధించెడివాఁడు.

ఇట్లు వివేకానందస్వామి వ్రాసినఉపన్యాసములు పత్రికలు వెలువరించిన అభిప్రాయములు అతిసుందరములగు శక్తిప్రాయములచే నిండియున్నవి. అతఁ డత్యుజ్జ్వలమైన ప్రతిభావిశేషమున సాధారణముగ లోకాతీతసామర్థ్యముగలవాఁడు. అతఁడు తానుచేయఁబూనుకొన్నపనిని నిర్వహించుటకై [illegible] స్వయ పతితపేదు. మహాత్ములగు గ్రీకులారా! మన మనోనిశ్చయము చదువుటవలనఁ బనియుండ దలచినట్టి పట్టులు, శ్రద్ధ, అతని సద్భావము, అతని నిష్కాపట్యము, అతని ధైర్యము, అన్నిటికంటె హెచ్చుగు స్వసుఖానిరపేక్షత్వము మొదలగు సద్గుణములు మహాత్ముని యుపదేశమునందుఁ జెక్కఁబడి యున్న పాఠము లయియున్నవి. మహాపురుషులచరిత్రములు లోకమున కుపాహారసంభూతములు. అట్టివారికి మనము చదువుకొనలసి [illegible] శ్రద్ధగా జదివినయెడల వారిప్రవృత్తి, వారిసద్గుణములు [illegible] మనకుఁగూడ నలవడునని [illegible].

---

# మాతృసందేశము

కొప్పర్తి నారాయణమూర్తిగారు, బి. ఏ., ఎల్. టి., (సాహితీసమితి)

గుండె బరువు నొకకొంత బాపుకొన
పంపుచుంటినీ వార్తను నేను
చెవినిబెట్టుమా చెప్పెడుదానిని
కన్నతల్లినని కాస్తతలంచి
పట్టెడు కూటికి పరదేశములకు
పరుగిడ నేలర? వరతనయా!
ఇంటియొద్ద నే నిట్టు లుండగను
వదలిపోవుటకు ప్రాణ మెటొప్పె
చిన్ననాఁటి నీ విభవంబును గని
విశ్వంబెల్లను వికసించె గద!
చిన్నవోవునను వీక్షించెనే యీ
విశ్వం బిప్పుడు విలపించుకద!
కొదువ లేవినా కూర్మిదినములను
తలచిన గుండెలు తరుగుకుపోవు!
కొడుకులు గల్గియు కొఱతగల్గిన
అమ్మ బదుకు నిక నడుగగ నేల!
మోదావహమై మ్రోగిపారెడివి
ఆనందాశ్రులు అడుగంటినవి
ఉడుకు బాష్పములె ఉబికిపారుచును
ఉన్నప్రాణముల నూనగ జేయు!

కాలు సేతులను కదపగ లేనుర
పెదవుల సరిగా పెదపగ లేను
నిన్ను చూడకను నిలువగ లేనుర
కన్నకడుపు నే కానటవోయి!
పూర్తిగ కన్నులు పోవక మునుపే
కంటబడుము నా కన్నులపాపా!
పూర్తిగ పుటములు పూడకముందే
అమృతపువాక్కుల నానగనిమ్ము!
స్పర్శజ్ఞానము చావకుండనే
వ్రాలిపడుము నాయొడిలో వలను!
ఐహిక సౌఖ్యము లాసింపను; నీ
పెట్టుపోత లిక వట్టివి సుమ్మీ!
ఇప్పుడని యికనని యెప్పుడును కాటికి
కాళ్లను చాచుకు కూర్చుని యుంటి;
ప్రాణము నీపై పరుగిడుచున్నది
పట్టి శక్యమును బాయుదు నేమొ?
అనల దెల్పితి ఆగ్రహమొందకు
ధర్మమె నిల్చును ధారుణిలోన.
వెట్టిభ్రాంతియని విసుగు నొందకుము
గాలిప్రాణ మొకగడియయునేమొ!

# శ్రీ సింహాచలక్షేత్రమ్

దేవులపల్లి అప్పలనరసింహం గారు, ఎమ్. ఏ., ఎల్. టి.

శ్రీ సింహశైలశిఖరే నివసన్ త్వయం భోః
వారాహదేహవిలసత్ప్రభు రాత్మయోనిః,
ఆశ్విన్యమాం బహువిధాసు నిమజ్జతాంగీం
త్రాయేత గాం దితిసుతాదిన భారతీం యః.

శోభాయుక్తమై తనరారు నీసింహాచలశిఖరమున, పూర్వము దితిపుత్రుడగు హిరణ్యాక్షునిబారి నుండి భూమిని రక్షించినట్టిది నేడు బహువిధములగు నాపదలలో మునిగియున్న ఈభారతభూమిని ఉద్ధరింపదగిన స్వయంభూవగు ప్రభుడు వరాహవిగ్రహమున విలసిల్లుచు నివసించియున్నాడు, గనుక.

హేమనేత్ర మథ హేమగాత్రిణమ్
భ్రాతరౌ జగద బాంధవౌ పురా,
సంవిదార్య నఖదంతహేతిభి
ర్యజ్ఞసూకరనృసింహ! శోభసే.

అన్నదమ్ములును జగత్తునకు శత్రువులును నగు హిరణ్యాక్షహిరణ్యకశిపులలో, మొదట హిరణ్యాక్షుని వరాహమూర్తివై దంతాయుధములచేతను, పిమ్మట హిరణ్యకశిపుని నరసింహమూర్తివై నఖాయుధములచే నను చీల్చి అన్నదమ్ము లిద్దఱను అణచుటకు "ఏ తీన అవతారములు రెండును [illegible] భావింపదగినవియు ను. అని సూచించుటకై గా క్షేత్రమున శ్రీ యజ్ఞవరాహ లక్ష్మీనృసింహస్వామి " యను నామమున శోభిల్లుచున్నావు.

రూప ముగ్రమపి ధారయ న్ముహుః
దుష్టదానవ విదారణోత్సుకః;
శాంతమూర్తి రిహ శస్యసే బుధైః
హ్లాదితైః కరుణయా తవ ప్రభో!

ఓ ప్రభువా! దుష్టులగు దానవులను చీల్చుటకై మాటిమాటికి నుగ్రరూపమును ధరించుచున్నను నీకరుణచేత సంతోషింపజేయఁబడిన జ్ఞానవంతులచేత శాంతమూర్తివని యిచట ప్రశంసింపఁబడుచున్నావు.

అత్ర యే శరణ మాగతా న తే
భీతి మాప్నుయు రితీవ యంత్రితః;
ఉగ్ర! వారయసి దీప్తి మాత్మన
శ్చందనేన శిశిరేణ వల్గునా.

ఓ ఉగ్రమూర్తీ! ఇక్కడకు శరణార్థులై వచ్చువారు భయమునొందకుండురను శంకచేతను నీదీప్తిని చల్లని చందనముచేఁ గప్పించుకొనుచున్నావు.

తేన సింహగిరిమధ్యసంస్థితమ్
రమ్యవృక్షవనరాజిశోభితమ్,
శీతలాచ్ఛమధునీర ముద్గిర
త్స్రవణం భవన మాదృతం త్వయా.

అందువలననే సింహశైలమధ్యమున నున్నట్టియదియు, మనోహరములగు వృక్షములు వనపంక్తులచే శోభించుచున్నట్టియు, చల్లని నిర్మలమైన తియ్యని నీరునిచ్చుధారలు గల్గినట్టియు ఆలయము నీచేత అంగీకరింపఁబడినది.

మాతులుంగపనసైః సపీతకైః
నారికేళకదళీఫలద్రుమైః,
పుష్పితైశ్చ కరవీరచంపకై
రాతనోతి నయనోత్సవం నగః.

మాదిఫల మారేడు పనస [illegible] కొబ్బరి అరటి మొదలగు ఫలవృక్షములతోను పుష్పించిన చంపక వృక్షములు గన్నేరు (అనఁగా [illegible], వేయి రేకులు అనఁబడు) వృక్షములతోను నిండియున్న యీకొండ కన్నులకు పండుగఁ జేయుచున్నది.

ఉ. కోయిలపాటకత్తె తనకూఁతలతప్పులు లెంగు దిద్దికోఁ
బాయక యభ్యసించుఁ జిలిపజ్జన పాఠము; గౌరవంత శ
త్యాయుతశిక్షనైన వొసఁగంతయుఁ బోదు; సమర్థుఁడౌ గురుం
డైయును జక్కఁ జేయఁగలఁడా ప్రతిభాపరిహీనశిష్యులన్.

మ. అపుడే నిద్దురలేచి పంకేరుఁడు, మయూర్యాలుఁగునా లేమ యం
దపుఁజండంబును రూపుచేసి వెలఁగొంకం గాంచి యూహించుఁజో
క్షీపదాబ్జంబుల ప్రముక్కాసం దొలఁగవే నిర్మాలమై పాపముల్
అప్రసూనం బెటువంటిమూర్తి యని వెయ్యాఖుల్ విలోకించుచున్.

గీ. పలుకరింప నెంచి, పలికిన నేమేని, పెడఁద వచ్చునన్న బెంగతోడ
సిగ్గు నముచుకొంచు నక్రిగోఁకుచు నిల్వఁ, జూచి చూడనట్లు చూచి చెలువ.

ఉ. ఉయ్యెల దిగ్గి పయ్యెదను నేరముసంగిడి జవ్వనంపులా
గియ్యది యన్నపోల్కిఁ గను లెత్తియు నర్ధనిమీలితంబుగా
నయ్యలినీలవేణి నడయందము దోఁపఁగఁ జెట్టుచాటుకుం
జయ్యనఁ బోయి తేనియలు జాల్కొనఁ బల్కెఁ దెనుంగుమాటలన్.

గీ. సిగ్గు పైకొని చెక్కిళ్లు జేవురింప, నగమునగముఁ బల్కె నాసొగసులాఁడి
"యతిథులరు, మాకు స్వాగతం బన్న నుడులు" వినను జెవిలోన విని వినఁబడనియటులు.

గీ. ముగుదమాట మూడిమెన మోపునంతకి, నందుఁ జేయ నళికు జాఱవిడిచి
పండితుండు పల్కె వనితా! నీవెవతెవు? ఒంటికత్తె విచట నుండనేల?

చ. అన విని కాంత నేఁ గవితనయ్య! వనాంతరసీమలందు రే
యును బవ లెప్పుడుం బ్రకృతియుత్సవముం దిలకించుచుం బికాం
గనలు మయూరముల్ సఖులుగాఁ బరిచర్యలు సల్ప నెంటిగన్
దినములఁ బుచ్చు జవ్వనముఁ దీరును దివ్యము శాశ్వతంబుగన్.

మ. కలికీ! యెంతటిచింత! నీవె కవితాకళ్యాణివా? బాపురే!
తెలియం జాలకయుంటి, నీకొఱకు నే దేశాలు పట్నాలు కో
ట్లలు పేటల్ గిరు లేళ్లు దాటుకొని మూటాముల్లెభారంబునన్
దల చెప్పట్లగ బట్టగట్ట పినుగత్తున్ వచ్చితిం గానకన్.

గీ. నిన్నుఁగూడి ధర్మనియతులఁ బాల్గొనఁ, దలఁచి వచ్చినాఁడ, వలచినాఁడ;
నన్నుఁ గ్రోసిపుచ్చ న్యాయంబె? వైదిక, విధిహితంబుగాఁగఁ బెండ్లియాడు.

గీ. అన్నవేళకు నతిథు లభ్యాగతులును, నింటి కరుదెంచి కూర్చుండ, వంట గింటఁ
జేయ నిల్లాలు లే దని చెప్పలేక, తెగఁబడితిఁ గాంత! యాకొఱ దీర్పు మింక.

సీ. హేమంతమున నైన నేఁటేఁట మునింగి, మడిదోవతులు పాత మైల లుతికి,
యిలు నూడ్పుటాదిగాఁ గల ప్రాఁచిపనులెల్ల, విసుగు పేసట లేక వెళ్ళఁబుచ్చి
దేవతార్చనవేదికీకంబు వెలిఁగించి, బానసంబున వంటపనులఁ దీర్చి,
యిరుగుపొరుగు నింట్ల కేఁగక తమయిల్లు, కనిపెట్టుకొని, దూది పెనఁచి దివ్వె
వత్తులను జేయుటో, లేక వలయుచీరల్లు గుట్టుటో తపిబట్ట లార్పుటయు నె
గాక యిల్లాలి కింకొక్క కార్యమున్నె? యిట్టి గృహిణీపదంబు నీకు నొను చాన!

సీ. వేదవేదాంగముల్ వివిధపురాణేతిహాసముల్ నాబుద్ధి నరగిపోవె
పంచకావ్యాల నేపట్టున నేశ్లోక, మడిగిన నల్లింతు నప్పుడపుడె
ఆశ్లేంక్లు పాణినియము పీల్చి పిప్పిఁ జేసితి నది నాయందె జీర్ణమయ్యె
వసుచరిత్రంబున వ్యాఖ్యానయుతముగ, శ్లేషభంగుల విమర్శించినాఁడ
కడకుఁ జిన్నయసూరివ్యాకరణ మెల్లఁ, బుటలు మలినంబుగాఁగ నెప్పుడును జదివి
సిద్ధివడసితి; సమరంబుఁ జిత్తశుద్ధి, తో నుపాసించి పొందితి దోషఫలము.

సీ. శాకుంతలములోన శతసహస్రములుగ, వ్యాకృతిదోషముల్ బయలుపఱతు
భవభూతిసాహిత్యభాండార మెల్లను, గానుకుఁ గాకుండఁ గడిగివైతు
బాణుని శ్రీహర్షు భారవి దూషింప, తొలిదెబ్బకైనను నిలుపఁ గలరె?
తిక్కయజ్వకుఁ దలతిక్క మాన్పెద నన్నఁ, బెరపిగా నొకనాఁడు లేఱలేదు
ఇంకఁ దక్కినవార లదేమి లెక్క, ముక్కుఁ బట్టినఁ బ్రాణంబు మొదలె పోవు
కాంత! నాకన్న నెర్వగల్ గలరె చెప్పుమ? నేను నన్నుఁగూర్చి పొగడుట నియతి గాదు.

గీ. నక్కవి, ప్రబంధ వేంకటేశ్వరవిజయమని, లానకర్త నామది కెక్కలాగు వ్రాసె
గాని, కొందఱు పాండిత్యగన్యతాపి, హీనలను దాఁచ, దన మది యేడ్చినారు.

చ. అని తనమాటముల్లెలు రయంబున విప్పి నెలంత! పాత్రముల్
గనుమ, యధీతమయ్యె నివి; గ్రంథము లెన్నియొ మోయలేక యుం
టను బదిలంబు చేసితిని; నాశ్రమ లెల్లను జంత చేసి నక్
గనుమ కృపాకటాక్షములఁ గావుమని! నీమన నేను చెప్పుమా!

గీ. తనకుఁ బరమశత్రుఁ డైన లేని ఛాందసుం, డీగతి కేటులో చోరకె; నింతతోడ
విడువరా దటంచు వెలఁది సంతోషించి, హాస్య మనుభవింప నభిలషించి.

గీ. ధర్మశాస్త్రమెల్లఁ దనుపన జీర్ణించె, నిగమవిధుల నందు నిధులు మీకు;
అట్టి గాటలఁ దలఁచి, బెట్టుల నీనాఁడు, కులటతో డిపొందు గోరినారు?

గీ. అనిన విని ఛాందసుం డిట్టు బెదరి లేచి, వెలఁది యేమంటి? ఏ పెట్లు కులట నైతి?
బహుపతిత్వము స్త్రీలకు భాగ్యమగునె? ధర్మహైరుద్ధ్య మక్కటా! చాఘంచె.

సీ. ఇఁకమీఁద నేను బలుపాటు లెల్ల సైఁచి, యింత దూరమ్ము వచ్చుట యెమ్మెలాఁడి!
బ్రహ్మచారిని, బ్రాహ్మణపండితుఁడను, కులటసాంగత్య మేరీతిఁ గోరుకొందు.

చ. అని కపటంబులేనివెత లాననసీమను దేలియాడఁ గా
ముని! కులటత్వ మెట్టు లనుమేయము నీయెడ నన్నుఁ గాంతయుఁ
మనమున నుబ్బుహాస్యరసమాధురి కన్నులఁ జిప్పిలంగ లోఁ
గొని మొగమందు మాయవగఁ గూర్చి వచించెఁ జరిత్ర మంతయుఁ.

సీ. వాల్మీకి ముసలితాపసి యయ్యు ననుఁ గూడ, రమణీయకళలఁ గరంచి యేలెఁ;
గాళిదాసుఁడు బిగ్గఁగౌఁగిట లాలించ, శృంగారభోగనిర్వృతిని గంటి;
భవభూతి పాండిత్యపటిమతో శాస్త్రస,మ్మతముగ ననుఁగూడి మాడినాఁడు;
భట్టబాణమయూరభారవిప్రముఖులు, దివ్యభాషాపేటిఁ దీర్చినారు;
నన్నపార్యుఁడుఁ దిక్కన మున్నుగాఁగఁ, దెలుఁగుఁగవు లెల్ల నాముద్దు సలిపినారు;
ప్రాఁతవారల యనుభోగ్యపటిమ సడలఁ, గ్రొత్తగోవాళ్ల నాసించి కూడుచుందు.

చ. అన విని పండితుం డనుసు నందలి ముందిన ప్రాఁతలంజ న
య్యును బదుచుందనంబుఁ గనులోరలఁ జూచెడి ముద్దరాలిసొం
పును, దనుసౌష్ఠవంబు, వలపుంబన, లెట్టులు గాచి యుంచితో
వనిత! శరీరరమ్యతకు బ్రహ్మ వినీతిని గూర్చెఁ డేలొకో?

గీ. అనుచు గ్రంథంబు లెల్లను నట్టె జవిరి, మూటముల్లెగ నవరించి పోఁతి! నేను
బోయి వచ్చెద, మనపొందు పొసఁగ దనినఁ, జెలియ చిఱునవ్వు నవ్వుచుఁ బెంతఁ జేరి.

ఉ. పైమునితోడ నాయురము బిట్టుగ నీకవ్రఁగింటఁ జేర్చి కే
లామనుధర్మశాస్త్రరత! యూరక పోయెదె యంచుఁ దెచ్చి కో
లీమన మూని కౌఁగిలిఁ జేరకుఁ దత్తఱమంది చూచు చే
మేమొ వచించుచుం గనుల నెత్తక చేతుల నూడఁబీఁకినన్.

సీ. ముద్దుమాటలు పల్క మోము చిట్లించుచు, శబ్దసంస్కారంబు చాల దనును;
అడవిపూఁదోటపూలఁ దోఁచియుంచుటఁ గాంచి, యాయలంకృతి లోప మెసఁగె ననును;
మురిపంబు దళుకొత్త మోవి యానఁగఁ బోవ, నెంగిలిరస మంచు నీసడించు;
బలిమిమై గిలిగింప నులికి బారెఁడుదాఁటి, జలిజలివడ లెల్లఁ జెల్ల ననును;
పిట్టరానట్టిసిలుగులఁ బెట్టి చెలువ, యాటపట్టించి చెల్లాట మాడుచుండఁ
గానవంబున నేదనో కాన రాక, మురళిరావంబు వినవచ్చె మోహనముగ.

సీ. పూలగుత్తులఁ గాంచి పునికి ముద్దాడును, పికమనోహరగీతి విన్న మెచ్చు;
నెలయేళ్ల పాటలఁ జెవియొగ్గి యాలించు, రాలుఁబువ్వుల నేరి మాల గ్రుచ్చు;

పొదరిండ్లలోఁ దూఱి పొదలయల్లికఁ జూచు, పడవిసంకలతోడ నాటలాడు;
సాంధ్యారుణాంకితజలదఖండముఁ గాంచు, వనరామణీయకమును దలంచు;
మధురరసము తేఁదు మనమునఁ దోఁలఁకాడ, లోకమెల్లఁ దేనెపాక మనును;
నిట్టిమృదులహృదయుఁ డెచ్చోటనుండి యో, పిచ్చివానిపోల్కి వచ్చుచుండె.

ఉ. అతనిఁ జూచి కాంత, తనయంతు నెఱింగినచెల్మికాఁడు సాం
ధ్యాతపకాంతులం బ్రకృతియందముఁ గాంచఁగ నేఁగుదెంచెఁ; దా
నాతఁడు నేఁ డొకళ్లొకరి యంసమునం జేయి వైచి ముగ్ధసం
గీతములన్ రసంబు లొలికింపఁ దలంపులు దీనరింపఁగన్.

సీ. వచ్చి రాక మున్నె వరునిఁ గౌఁగిటఁ జేర్చి, మూఁతివడ్డకనుల ముత్తైసరుల
గతినిఁ బ్రమదబాష్పకణములు చిప్పిల్ల, నొడలఁ బుల్కనారు లుప్పతిల్ల.

సీ. రెండుపెదవులు సేతువౌరీతి నిరువుర, రాకరాకకౌఁగిలిపులలోన నుండి రవుడు;
వసుధఁ బ్రతిదియుఁ బ్రణయపిపాసతోడ, నొకటినొకటి నాశ్లేషించుకొన్నఁ దోఁచె.

గీ. అనిమిషత్వమునొంది యాయద్భుతంబు, గనయుచుండెను శాస్త్రి నోరంత దెఱచి
యంతఁ గౌఁగిలి వీడి యాయబ్జనేత్ర, చిన్నినవ్వులు మోమునఁ జిన్నెలొలుక.

ఉ. చాలిఁక శాస్త్రిగారు! శ్రమ చాల సహించి మదర్థ మయ్యయో!
కాలుసఁ గాలు గొట్టుకొనఁ గానసీమకు వచ్చి యింత కే
పేలును బొందకే తిరిగి వీఁపురిఁ జేరుటఁ జూడ నాకునున్
జాలి జనించె; దైవము ప్రసన్నము గా, దిఁకఁ బొందు నావుడున్.

గీ. ఊర్వశి యొకవంకఁ బరిభవ మింక నొక్క, కడను జిత్తమ్ముఁ జలచులఁ గాల్చుచుండఁ
గటము లదరఁగఁ గనుబొమల్ నటనసేయఁ, బండితుండు పళ్లు బిగఁబట్టి ప్రతిన చేసె.

శా. నేనే తిమ్మయశాస్త్రిపుత్త్రుఁ డయినన్ నిత్యమ్ముఁ గాత్యాయనీ
ధ్యానాహూతహృదబ్జుఁడన్ విధులసద్ధర్మంబులం బ్రత్యుష
స్స్నానంబుం బొనరింతు నేనిఁ గవితా! సత్యంబుగా నీజగుల్
నీనాగెంబు నొయ్యారియుంచనడలున్ నిర్మూలముం జేసెదన్.

మ. అని కోపంబున మాటముల్లె గొని సంధ్యావందనాపేక్షచే
వనమార్గంబునుబట్టి యేటిదరికిన్ బాండిత్యవాసంబు పో
యిన, నాయిద్దఱు నెచ్చెలుల్ వనవిహారేచ్ఛన్ నదీసైకతం
బునకుం బోయిరి జంటఁబాయక మనంబుల్ దేహముల్ వర్తిలన్.

గీ. సందెచీఁకటిలో నేదో, చాయనుండి, పీనులం బడె నకకీరగాన మొండు;
ప్రకృతి నిదురించె నాజోలపాటలోని, తియ్యఁదేనియలు లక్కఱ దీఱ నాని.

# ప్రాచీనాంధ్రు లెవ్వరు? ఆర్యులు కారా?

చిలుకూరి వీరభద్రరావు గారు

(గత సంచిక శేషము)

ఇప్పటికి రెండువేలయైదువందల సంవత్సరముల నాఁడు శాక్యులు, లిచ్ఛవులు, మొదలగు క్షత్రియసంఘములవారు బహుకాల క్రమశాలులుగ నుండి ప్రాచీన వైదికహిందూ దేశమున గొప్పమార్పును బుట్టించినట్టి ప్రతిభాశాలులు. వీరికిఁ బూర్వము కురుపాంచాల శాఖలవారు వైదికమతమును విస్తరింపఁజేసి యుండిరి. అధిరాజ్యములను స్థాపింపలేదు. కాని యీశాక్యులును, లిచ్ఛవులు, మొదలగువారు మౌర్యసామ్రాజ్యము, ఆంధ్రసామ్రాజ్యము, గుప్తసామ్రాజ్యమువంటి మహాసామ్రాజ్యములను, జైనబౌద్ధమతములవంటి మహామతములను స్థాపించి భరతఖండమునకు నెక్కుడు ఖ్యాతిని గడింపఁజేసిరి. ఈక్షత్రియశాఖలవారెల్లరు వజ్జియను లను క్షత్రియసంఘమునకు సంబంధించినవారు. ప్రథమమున వీరిలో లిచ్ఛవులనుగుఱించి తెలిసికొనుటకుఁ బ్రయత్నింతము. వీరినిగూర్చి బౌద్ధజైనవాఙ్మయములలో నున్నదానినంతయుఁ గ్రోడీకరించి "బౌద్ధయుగమునాఁటిక్షత్రియకులము" లను గ్రంథములో వ్రాయఁబడియున్నది. ఈ గ్రంథము శ్రీబాబూ విమలచరణలా గారిచే రచింపఁబడి రెండేండ్లక్రితము ప్రకటింపఁబడినది. ఈ గ్రంథకర్తగారి యభిప్రాయములకును నాయభిప్రాయములకును గొంతభేద మున్నను ఈ క్షత్రియసంఘములనుగుఱించి యిదివఱకు విస్పష్టముగాక సందిగ్ధములుగా నున్న పెక్కువిషయములు వీరి గ్రంథమువలన నేఁడు తేటతెల్లము లయినవి. లిచ్ఛవులలోఁ బెక్కుతెగ లున్నట్లు తెలియుచున్నది. వేదములలోఁ గాని, మహాభారతమునఁ గాని లిచ్ఛవుల నామములు గానరావు గాని మనుధర్మశాస్త్రములోను కౌటిల్యుని యర్థశాస్త్రమునను గనఁబడుచున్నవి. వీరిజన్మచరిత్రమునుగూర్చి యొక విచిత్రమైన గాథ బుద్ధఘోషుఁడు 'బుద్ధకపాఠ' మను గ్రంథముపైని వ్రాసిన పరమార్థ (పరమార్థ) జోతిక (జ్యోతిక) అను వ్యాఖ్యగ్రంథములో నిట్లు చెప్పఁబడినది.

కాశీరాజపట్టమహిషి గర్భమును ధరించెను. దాని నెఱింగి యామె రాజునకుఁ దెలియఁజేసెను. అతఁడు గర్భసంరక్షణార్థము చేయవలసినకర్మల నన్నిటిని గావించెను. నెలలు గడచినపిమ్మట నామె ప్రసవగృహమును బ్రవేశించెను. ఒకనాఁటి సూర్యోదయకాలమున నొక శుభముహూర్తమున నామె ప్రసవించెను. అప్పు డామెగర్భమునుండి లక్కవంటిదియు, బంధుజీవక పుష్పములవంటిదియు నెఱుపువన్నెగల యొక మాంసపుముద్ద వెలు

పల పడెనట! తక్కిన రాణులు దీనిని జూచి తాము రాజున కీవర్తమాన మంపినయెడల సువర్ణచ్ఛాయగల సుకుమారుని గాంచుటని యెదురు చూచుచున్న రాజునకుఁ దమపై నెల్లఁ గోపము వచ్చునని భయపడి యాతనికిఁ దెలియఁజేయక వెంటనే వా రామాంసపుముద్ద నొకపేటికలో నుంచి దానిపై రాజముద్రికను ముద్రించి యియ్యది పట్టమహిషియొక్క బిడ్డ యని యొకచీటిని వ్రాసి దానికిఁ గట్టిపెట్టి యాపేటికను గంగాప్రవాహమున విడిచిరఁట. ఇయ్యది మహాభారతములోని కుంతీదేవి కర్ణుని ని యొరులకుఁ దెలియకుండ గంగాప్రవాహమున విడిచినకథను బోలియున్నది. అప్పుడాగంగయొడ్డున గోబృందముల వెంట నున్న యొక యోగి గంగాప్రవాహమునఁ గొట్టుకొనివచ్చుచున్న యాపేటికను గాంచి దానిని పట్టుకొని దానిఁగట్టిన చీటిని జదువుకొని తాఁ రాజముద్రికను గాంచి దానిని దెఱచి చూడఁగా నం దొకమాంసపుముద్ద గానంబడియెనఁట! అయ్యది గర్భములోని పిండముగా భావించి యాతఁడు దానిని భద్రముగాఁ దన యాశ్రమమునకుఁ గొనివచ్చి పదిలముగా తమూల నుంచి సంరక్షించుచుండెనఁట! పదు దినములు గడచునప్పటికి యామాంసపుముద్దము రెండుభాగములుగ విడిపోయెనఁట! అంత నాఋషి వానిని జాగరూకతతోఁ బోషించుచుండెను. మఱిపదిదినములు గడచునప్పటికి శిరస్సు, కాళ్లు, చేతులు మొదలగునవి యాకారము లేర్పడినవఁట! మఱియొక పది దినములకు నం దొకటి సువర్ణచ్ఛాయను బోలిన మగబిడ్డగను, రెండవది యాఁడుబిడ్డగను నేర్పడియెనఁట! పితృవాత్సల్యముతో నాతఁ డాబిడ్డలను బాలుబోసి పెంచుచుండెనఁట! వారలగర్భములలోని కేవదార్థమును బోసినను మణులలోని పదార్థమువలె వికసించుచుండుటచేత 'నిచ్ఛవులు' అని అనఁగాఁ జర్మము లేనివారని చెప్పుకొనుచుండిరఁట! మఱికొందఱు 'లీనచ్ఛవులు' అని అనఁగా సంధింపఁబడిన చర్మములు గలవారని చెప్పుకొనుచుండిరఁట! (ఇది జరాసంధుని జన్మవృత్తాంతమును బోలియున్నది.) ఆఋషి ప్రతిదినము గ్రామములోనికి నుదయమునఁ బోయి చాలప్రొద్దెక్కినగాని తిరిగివచ్చుట సంభవింపనందున గోపకులు దాని నంతయుఁ గనిపెట్టి ఓఋషిపుంగవా! ఈబిడ్డలను మీవంటివారు పెంచుట కష్టము. మాకు దయచేసినయెడల మేము పెంచెదము. అని ప్రార్థింపఁగా నాతఁడు సమ్మతించెనఁట! అపుడు నాఁడు గోపకులందఱు పలాశములను ధరించి దారి చక్కఁజేసికొని మార్గముపొడవునను బుష్పములు చల్లుకొనుచు సంతోషము పెంపుమీఱ మేళతాళములతో రాఁగా నాఋషి వారితో వీరిరువురు మంచిగుణవంతులు గావున వీరిని జాగ్రత్తతోఁ బెంచి పెద్దవారయిన పిమ్మట వీరిలో నాఁడుబిడ్డను మగబిడ్డకిచ్చి పెండ్లి చేయుటయే కాక రాజు నడిగి కొంతభూమి గైకొని యొకపురము నిర్మించి యందు వీరిని పట్టాభిషిక్తులను గావింపవలసిన దని చెప్పి యాబిడ్డలను వారల కప్పగింపఁగా, వారలు సంతోషముతోఁ గొనిపోయి యాతఁడు చెప్పినట్లు మిక్కిలి జాగరూకులై పెంచుచుండిరి.

వీరలు పెద్దవారయిన తరువాత బలాఢ్యులై గోపకులబిడ్డలతో నాటలాడుకొను చుండు నప్పుడు తగవులు కలిగినచో వీర లా గోపకుల బిడ్డలను దయమాలి పిడికటిపోటులం బొడుచుచు మోకాటిపోటులు పొడుచుచుఁ గొట్టు చుండువారగుటచేత నేడ్చుచు నిండ్లకుఁ బోయి తమ తల్లిదండ్రులకు వీరివలనఁ జాలమందికిఁ గష్టములు వచ్చుచున్నవనియు వీరి నుంచరాదు వర్జింపవలసిన దనియు (వజ్జితబ్బా) మొఱ్ఱవెట్టి కొనిరఁట! అప్పటినుండి యాదేశము మూఁడు వందల యోజనముల పరిమాణము గలిగి 'వజ్జి' యనుపేరఁ బరఁగుచుండెను. పిమ్మట నీగోపకులు రాజదయను సంపాదించి యానతియను మతిని బొంది యాదేశమును సంపాదించి పురమును నిర్మించి దాని కాసిని పట్టాభిషిక్తుని గావించిరి. ఆ బాలునకు యుక్తవయస్సు వచ్చిన వెనుక యుక్తవయస్సు వచ్చిన యాకన్యకకు వివాహము గావించిరి. ఆసమయమున రాజు 'నేటినుండి యేపెండ్లికొమరుని నిక్కడకుఁ దీసికొని రాఁగూడదు; ఇక్కడ నుండి యేపెండ్లికొమార్తెను వెలుపలకుఁ బంపరాదు' అని శాసించెనఁట! అప్పు డాదంపతులకుఁ బ్రథమమున నిరువురు కవలు జనించిరఁట! ఇట్లు పదునారుమారులు కవలు జనించిరఁట! ఇట్లొక జంట వెంబడి నొకజంట జనించి పెరుఁగుచుండుటచేత పురము విశాలము చేయఁబడవలసి వచ్చెను. పురము చుట్టును పాతిక యోజనముల కొక్కొక్క ప్రాకారము చొప్పున మూఁడు ప్రాకారములు నిర్మింపఁబడి చాలకున్నందున రానురాను పెంపు చేయఁబడుచువచ్చిన దాటచే, 'వైశాలి కాకట' యనుపేరున (వేసలి) వ్యవహరింపఁబడుచుండెను. ఇయ్యది రామాయణములోని లక్ష్మణశత్రుఘ్నుల (కవల)యొక్కయు, మహాభారతములోని నకులసహదేవులయొక్కయు జన్మవృత్తాంతములను దలఁపునకుఁ దెచ్చుచున్నది. రామలక్ష్మణులు విశ్వామిత్రునితోఁ గూడ వైదేహిని పెండ్లియాడుటకై మిథిలానగరమునకుఁ బోవుచు నీపురము నేలుచున్న సుమిత్రుఁ డనురాజుచే సన్మానింపఁబడినట్లు రామాయణమున వర్ణింపఁబడియె నని (భారతి రెండవపంచికలో) యిదివఱకే తెలిపియున్నాను. కాని యీగాథలో మాంసపిండము రెండుతునుకలై యొకఋషి (అంశిదేవుఁడు) చే సంతుకాఁబడుటయు నయ్యవి బిడ్డలగుటయు నస్వాభావికముగుటచే నెవ్వియో రెండు జాతులసమ్మిళనమువలన నీసంఘ మేర్పడియుండునను నూహతోఁ బరిశోధకు లగు పండితులు లిచ్ఛవు లెవరై యుండురని పరిశోధింప నారంభించిరి. వారిలో నిరువురను ముఖ్యులనుగాఁ జెప్పవచ్చును. అందు మొదటివారు విన్సెంటుస్మిత్తుగారు, రెండవవారు కీర్తిశేషులయిన మహామహోపాధ్యాయ సతీశచంద్ర విద్యాభూషణు లనువారు. లిచ్ఛవులు న్యాయవిచారణపద్ధతులయందును, మరణముఁజెందిన వారి విషయమై జరుపుకర్మలయందును త్రివిష్టపు (Tibet) దేశపుపద్ధతు లనుసరించుటచే టిబెటునుండి వచ్చినవారని స్మిత్తుగారు నుడివిరి. అది సరికాదు. ప్రాచీనపారశీకము (పార్థియా, మీడియాలు) నుండి వచ్చినవారయి

చెప్పెడియీ క్రిందివాక్యము గనంబడుచున్నది.

"A Brahmana or a Ksatria by birth, a Scion of the Ugra Race or Licchavi, who enters the order eating alms given him by others, is not stuck up on account of his renowned Gotra." Jacobi Jaina Sutras, Part II S. B. E. Vol. xlv. P. 321)

ఉగ్ర లేక లిచ్ఛవిజాతీయుఁడై జన్మచేత బ్రాహ్మణుఁడైనవాఁడుగాని క్షత్రియుఁడైన వాఁడుగాని అర్హుఁడైనపుడు, ఇతరులవలన దానములను పరిగ్రహించుటకుఁ దనప్రసిద్ధమైన గోత్రమును బట్టి కట్టుబడియుండ నక్కఱ లేదు.

పైజైనగ్రంథములోని వాక్యమువలన లిచ్ఛవులు ఉగ్రజాతికి సంబంధించినవారుగఁ గన్పట్టెదరు.(K. B. I. P. B.) ఉగ్రులన నెవ్వరు? ఉగ్రుఁడనఁగా క్షత్రియునకు శూద్రస్త్రీయందుఁ బుట్టినవాఁ డని ధర్మశాస్త్రములు నక్కాణించుచున్నవి. విశ్వంభరశాస్త్రమునందు:—

శూద్రాం క్షత్రా దుగ్రజాతి ర్యుద్ధశస్త్రాది జీవికాశస్త్రవ్యాపకుశలః సంగ్రామకుశలో భవేత్। తయా వృత్త్యాహ్యా జీవన్నైవ శూద్రధర్మాంశ్చ పాలయేత్। శూద్రాయాం జాతస్తు వైశ్యా ద్వైశ్యకరణో లిపిలేఖకృత్॥

అని క్షత్రియునకు శూద్రస్త్రీయందుఁ బుట్టినవాఁడు ఉగ్రుఁడనియు, వానికి యుద్ధము శస్త్రవిద్యయు జీవికయనియు, దీనిచే జీవనము జరుగుచున్న శూద్రధర్మము లాచరింపవలెనని యును జెప్పఁబడి యున్నది. "వైశ్యా శూద్రాస్తు రాజన్యా న్మాహిష్యోగ్రౌ సుతౌ స్మృతౌ" అని క్షత్రియునకు వైశ్యశూద్రస్త్రీల యందుఁ బుట్టినవారు క్రమముగ మాహిష్యుఁడు నుగ్రుఁడు ననఁబడుదు రని యాజ్ఞవల్క్యుఁడు పలికియున్నాఁడు. టిబెటుదేశమునకు నుత్తరమునను మంగోలియాదేశము పడమటిహద్దులలో ఉయిగర్ లేక ఉషన్ (Uigur or Ushon) జాతివారున్నట్లు తెలియుచున్నది. ఈ ఉయిగర్ శబ్దము ఉగ్రశబ్దముగను, ఉషన్ శబ్దము ఉశనశబ్దముగను సంస్కరింపఁబడినట్లు కన్పట్టుచున్నది. ఉశనసుఁడు, ఔశనసస్మృతి మొదలగునవి సంస్కృతభాషలోఁ గలవు. మఱియును, ఉశీనరు లనువారు ఉత్తరకురుభూములనుండియు, ఉత్తరమద్రభూములనుండియుఁ గురుపాంచాలురతోడను వసులతోడను గంగాతీరమునకు వచ్చినట్లుగా భారతి మూఁడవసంచికలోఁ దెలిపియున్నాను. కంసునితండ్రి ఉగ్రసేనుఁ డనువాఁడు మధురాపురము నేలుచుండె నని భాగవతాదిగ్రంథములనుబట్టి మనము దెలిసికొనుచున్నారము. ఈ జాతివారు బ్రాహ్మణులు, క్షత్రియు లెట్లయిరో వీరు వాసిష్ఠగోత్రు లెట్లయిరో యిఁక ముందుఁ దెలిసికొనవలసి యున్నది. మొదటిసారి బుద్ధదేవుఁడు లిచ్ఛవులను గలిసికొన్న విషయమును దెలుపుచు, వైశాలికాపురమున మహామారిరోగము ప్రజలను బీడించుచుండ లిచ్ఛవులు పోయి బుద్ధదేవుని గౌరవముతో రక్షింపఁగా నాతఁడు సంభాషించునపుడు దెవుడును వారలను వాసిష్ఠులారా! యని సంబోధించుచుండువాఁడఁట. ఇఁక మనము మహామహోపాధ్యాయ డాక్టరు సతీశచంద్రవిద్యాభూషణు లనువారు తెలిపినయభిప్రాయ

...నముగూర్చి కూడ కొంత చర్చింపవలసి ...యున్నది. వీరు క్రీస్తుశకమునకుఁ బూర్వము ...౧౫-వ సంవత్సరములో పారశీకపురాజగు ...రయుసు అనువాఁడు భరతఖండముపై దండె ...ట్టకై సైన్యములఁ బంపెననియు, ఆసైన్య ...ములు హీరతీసుకు దూరముగా నున్న నిసిబిసు ...isibis) అను ప్రదేశమునుండి పంపఁబడిన ...యు,వారు సింధునదీతీరమునకువచ్చి యక్క ...డనుండి పంజాబులో ప్రాచీనాచారపరాయణు ...లైన బ్రాహ్మణులు మిక్కుటముగా నున్నం ...దున మగధప్రాంతమున వ్రాత్యులు (బహి ...ష్కరింపఁబడినవారు) విశేషముగా నున్నం ...దున మగధమునకు వచ్చిరనియు, ఈనిశిబీలనే ...లిచ్ఛవీ లని మనువు వ్రాసినాఁడనియు శబ్ద ...సామ్యము కలదు. కాఁబట్టి లిచ్ఛవులు ప్రాచీన ...పారశీకులని వ్యవహరించుచున్నారు. మను ...స్మృతికి వ్యాఖ్యానము చేయుచు కుల్లూకభట్టు ...లిచ్ఛివిశబ్దము నిచ్ఛివిశబ్దముగఁ జదివి యట్లు ...వ్యాఖ్యానముచేసియుండుటచేత డాక్టరు సతీశ ...చంద్ర విద్యాభూషణులు తప్పుత్రోవఁ ద్రొక్కి ...రి లాగా రాక్షేపించిరి. మఱియును గౌతమ ...బుద్ధుఁడు విన్సెంటు స్మిత్తుగారియభిప్రాయము ...ప్రకారము క్రీ. శ. పూర్వము ౪౮౦ లో ...నిర్వాణముఁ జెందినది వాస్తవమైనను సిం ...హళగాథల ననుసరించి క్రీ. పూ. ౫౪౪ లో ...నిర్వాణముఁ జెందినది వాస్తవమయినను క్రీ. ...పూ. ౫౧౫ లో డెరియుసు దండయాత్ర ...కాలముగా ప్రాచీనపారసీలువచ్చినారని తెలు ...ట బొత్తుగా విశ్వసనీయముగా లేదని ...బాబూ విమలచరణలాగారి యభిప్రాయ మై

యున్నది. కాని యిక్కడికూడ మనలాగారు పొరపడుచున్నారేమో యని భయము వేయుచున్నది. వీరికి డెరియసుదండయాత్ర మాత్రమే జ్ఞప్తియందుండి భయముగొల్పుచున్నది గాని యంతకుఁ బూర్వపుస్థితిని గమనింపకున్నారు. బాబూ విమలచరణ లా గారు లిచ్ఛవులు ప్రాచీనపారశీకమునుండి వచ్చినారని యొప్పుకొన్నందున వాసిష్ఠగోత్రులనియు, బ్రాహ్మణులనియు, క్షత్రియులనియు, వర్ణింపఁబడిన లిచ్ఛవుల యార్యత్వమున కెక్కడ భంగము కలుగునో యని భయపడుచున్నట్లు గన్పట్టుచున్నది. వైదికయుగముననే ప్రాచీన పారశీకమునకును భరతఖండమునకును నెక్కువసంబంధ మున్నట్లు గన్పట్టుచున్నది. రామాయణమునుబట్టి లిచ్ఛవులలో నుగ్రజాతివారు గలరని తోఁచుచున్నది. మహాభారతమును బట్టిగాని తదితరపూర్వగ్రంథములనుబట్టిగాని ప్రాచీనపారశీకమునకు సంబంధించిన తెగలు కూడ లిచ్ఛవులలోఁ గలిసిపోయినట్లు గన్పట్టుచున్నది. మఱియును కొన్ని వేలసంవత్సరములక్రిందటనే పార్థియా, మీడియా, అస్సీరియా, కాల్డియా, ఫొనీషియా దేశములకు నెక్కువసంబంధము గన్పట్టుచుండుటచేత డెరయసునకుఁ బూర్వము మనకును ప్రాచీనపారశీకమునకును సంబంధము లేదనుకొనుట భ్రమవలెఁ గన్పట్టుచున్నది. ఋగ్వేదకాలముననే యెక్కువ సంబంధ మున్నట్లు గన్పట్టుచున్నయది. ఇట్టి నాయభిప్రాయము నొప్పుకొకున్న యెడల ఋగ్వేదమంత్రములు రచింబడి ౨౫౦౦ సంవత్సరములకన్న నొ...

కాలేదని చెప్పవలసివచ్చును. అది అంతవిశ్వాసనీయముగఁ గనుపట్టదు. కాశ్రీన మహామహోపాధ్యాయులవారి యభిప్రాయములోఁ గూడ సత్యము కలదు గాని లేకపోలేదని కన్పట్టుచున్నది. లిచ్ఛవులను వారిలోఁ బెక్కుశాఖలు గలవు. వీరియభిప్రాయము లన్నియు సత్యములే యని యిఁకముందుఁ దెలుపఁబోవుచున్నాను.

లిచ్ఛవులశీలమును దెలిసికొనుటకై వాని గూర్చిన మఱికొన్ని వర్ణనములను బౌద్ధగ్రంథములనుండిచూపింపవలసియున్నది. బౌద్ధగ్రంథములలోని వర్ణనములన్నియు శ్రీబాబూవిమలచరణలాగారి 'బౌద్ధయుగమునాఁటి క్షత్రియకులము' లను గ్రంథమునుండి సంగ్రహించినవే కావున నీగౌరవమంతయు వారికేఁ జెందవలసియున్నది. బుద్ధుఁడు జీవించియున్నకాలమున వజ్జిజనులు పెక్కుకులములవారుగా నుండిరి. ఇయ్యవి లిచ్ఛవులు, వైదేహులు, తిరుభుక్తులు మొదలుగాఁ గల నామములతో నొప్పెడి 'అష్టకులము'లని కన్నింగుహాముగారు తెలిపిరి. ఒక్కొక్కకులమునకు నొక్కొక్కసభ్యుఁడుచొప్పున నెన్నుకొనఁబడిన యెనమండ్రు సభ్యులతోఁ, గూడిన న్యాయవిచారణసభ, (Jury) వీరికిఁ గలదట. (Cunningham's Ancient Geography of India P. 447). ఈతెగలవారందఱు యుద్ధవ్యాపారతంత్రములప్రావీణ్యమును గఱపు నట్టియస్త్రశస్త్రాగారప్రతిష్ఠాపనలతో నొప్పుచు వీరాధివీరులై యొంగోరులయెడఁ బ్రేమాతిశయములం జూపుకొనుచు భరతఖండముయొక్క యీశాన్యదిగ్భాగమునఁ బ్రసిద్ధులుగనుఁ బరాక్రమవంతులుగను నున్నవారని బౌద్ధసూత్రాదిగ్రంథములలో వక్కాణింపఁబడి యుండెను. Buddhist Sutras, S. B. E. Vol. XI. P. 3, Vide also Turnour, Pali Buddhist Annals No. 5. J. A. S. B., Dec. 1838, P. 992.

ఒంగోరులయెడ వీరుచూపు ప్రేమాతిశయములు నిరుపమానములు. ఒకనికి జబ్బుచేసిన యెడలఁ దక్కిన లిచ్ఛవు లెల్లరును వానిని జూడఁ బోయెదరు. ఒక లిచ్ఛవుని యింటఁ బండుగు వచ్చినఁ దక్కిన లిచ్ఛవు లెల్లరును దోడ్పడుదురు. విజాతీయుఁడైన గొప్పవాఁ డెవ్వఁడయిన తమనగరమునకు వచ్చిన యెడల వా రెల్లరును వాని కెదురుగఁ బోయి గౌరవముతోఁ గొని వచ్చి యర్ఘ్యసత్కారములచే గౌరవింతురు. (సుమంగలవిలాసము. Burmese Edition pp. 103-105) వారు సురూపులును, చిత్రవిచిత్రములయినరంగులతో నొప్పెడి దుస్తులను ధరించుటయం దభిలాషగలవారును నఁట. (Watterson Yuan Chang Vol II. P. 79. బుద్ధుఁడు వారలను మొట్టమొదటఁ గాంచినపుడు వింతలగు వారిరూపరేఖావిలాసములను వీక్షించి వారిని దేవతాంశసంభూతు (Tava timsa) లనుగఁ దలంచెనఁట. మహాపరినిర్వాణసూత్రమునందు లిచ్ఛవు లిట్లు వర్ణింపఁబడిరి. బుద్ధుఁడు వైశాలినగరమునకు వెలుపలిభాగమున నున్న అంబపాలీయొక్క మామిడితోఁటలో వసించియున్నాఁడని విన్నప్పుడు లిచ్ఛవులందఱును వానిని సందర్శింప పెక్కురథములను సమకూర్చికొని పోయి

రనియు కొందఱు శ్యామలవర్ణము గలవారు గను, కొందఱు గౌరవర్ణము గలవారుగను, మఱికొందఱు ఎఱుపు లేక తెలుపువర్ణము గలవారుగ నుండిరనియు, వారివారివర్ణములకుఁ దగిన యావర్ణములఁ బోలు రంగులు గల దుస్తులతో నేగిరనియు వర్ణింపఁబడి యుండెను. వా రలంకరించుకొన్న యాభరణములు కూడ వారి దేహచ్ఛాయలం బోలిన రంగులు గలవిగనే యుండెనఁట. (Buddhist Sutras, S. B. E. Vol XI. P. 31) అట్టి వర్ణనము తే 'అంగుత్తరనికాయ'మను గ్రంథమునందును చేయఁబడినవి. వీరలు కేవలము పర్వదినములందు మాత్రమే కాక ప్రతిదినము సామాన్యసందర్భములకు కూడ నట్టి రంగుల దుస్తులనే ధరించుచుండి రని పై గ్రంథమును బట్టి తెలియుచున్నది. ఒకప్పుడు గౌతమ బుద్ధుని మహావనమునందలి కూటాగారశాల యందు వినయవిధేయులై ౫౦౦ లిచ్ఛవులు వానిని బరివేష్టించి సేవించుచున్నపుడు కొందఱు లిచ్ఛవులు నీలవర్ణముగల దేహములు, నీలవర్ణముగల దుస్తులు, నీలవర్ణము గల యాభరణములు, కొందఱు పీతవర్ణము (పచ్చని) గల దేహములు, పీతవర్ణముగల దుస్తులు, పీతవర్ణముగల యాభరణములు; మఱికొందఱు నిదేరీతిగ నెఱుపు, తెలుపు వర్ణము గలవారుగా నుండిరని తెలుపుచున్నది. (Anguttara Nikaya P. T. S. Part III. P. 239). మఱియు నిదే వర్ణనము మహావస్తు యను సంస్కృతబౌద్ధకావ్యమునందుఁ గూడఁ జేయఁబడినది. ఇట్లు నీల, పీత, గౌర, శ్వేత, రక్త, హారిత, ఆదిగాఁగల నానావర్ణములు గలవారు నానావిధము లయిన రంగులదుస్తులతో నొప్పారుచున్నవా రని తెలుపుట చూడఁగా లిచ్ఛవులలో నట్టివర్ణములు గల తెగలవా రుండిరని చెప్పకయ వేద్యమగుచున్నది. వారి వారి రథములకుం గట్టినగుఱ్ఱముల రంగులు నట్టివిగానే యుండెనఁట! మఱియు మహావస్తుకావ్యమునందలి వర్ణనములఁ జూచినపుడు మహారాజులు వారివైశ్వర్య భోగములను వెంటఁ గొనిపోవురీతిగ నుండెను. వారు వేసలీనగరమునుండి పోవునపుడు మాక్తికములు, మణులు, సువర్ణము మొదలగు వానితోఁ బొదుగఁబడిన గుఱ్ఱములు, రథములు, ఏనుఁగులు మొదలగు వాహనాదికములు ౯౮౦౦౦ తోడ వారు పయనమై మహావనమునకుఁ బోయిరఁట. 'మహావస్తు' వను కావ్యములో

"లిచ్ఛవినా ఆహంసు అన్యదాపి భగవాన్ భగవానాహ అన్యదాపి వాసిష్ఠా. భూతపూర్వం వాసిష్ఠా అతీత మధ్వానే పాంచాలే జనపదే కాంపిల్లనగరే రాజా బ్రహ్మదత్తో నామ రాజ్యం కారేసి"

అని యుండుటచేత వేసలి యొకప్పుడు కాంపిల్యనగరమను పేరిటఁ బరఁగుచుండె నని తెలియుచున్నది. పాణిని వక్కాణించిన ప్రాక్పాంచాలు రనువారు వీ రేమో పరిశోధింపవలసియున్నది. అయినను బుద్ధుఁడు బ్రదికి యుండి వారిలోఁ జేరి వారికి ధర్మమును బోధించిన కాలమున వారిస్థితి యింతయైశ్వర్యవంతమయినదిగఁ గన్పట్టుచున్నది. బుద్ధుఁడు

చెప్పినదానిని సంయుక్తనికాయ మను గ్రంథము పదిలపఱచియున్నది. "ఓభిక్షువులారా! వీరిని చూడుఁడు! ఈ లిచ్ఛవులు సుస్థిరచిత్తులును, అప్రమత్తులును ధనుర్వేదపారంగతులునై యుండియుఁ గట్టెకదుంగలను దలగడలుగాఁ జేసికొని నిద్రించుచున్నారో! వైదేహీపుత్రుఁడైన మగధరాజు అజాతశత్రుఁడు. వీరిపై వైరము గల్పించుకొనుటకు లోపమేమియు వీరియందుఁ గన్పట్టదు. భిక్షువులారా! ఎప్పుడైన నికముందు వీరు సుకుమారులై హంసతూలికాతల్పములఁ బన్నుండి ప్రమత్తులై మైమఱచి నిద్రపోయినయెడల వైదేహీపుత్రుఁడైన మగధరాజు వీరిలోపములను గనుపెట్టి వీరిపై దాడివెడలుటకుఁ గారణము గనుపెట్టఁగలిగి యుండును." (సంయుక్తనికాయ. P. T. S. Part II 267, 268.) చదువరులారా! ఈ పై బౌద్ధగ్రంథములందలి వర్ణనములు శ్రీకృష్ణుఁడు మహారణ్యమునందున్న పాండవులను జూడ వచ్చి దుర్యోధనునిదుర్ణయమును దలపోసి మహర్షులకుఁ బాండవుల దుస్థితిని వ్యక్తపఱచినవిధమును దెలుపుచున్నది. బౌద్ధగ్రంథములందు వర్ణింపఁబడిన యజాతశత్రుఁడను మగధరాజే మహాభారతమునందు వర్ణింపఁబడిన దుర్యోధనుఁడు; గౌతమబుద్ధుఁడే శ్రీకృష్ణుఁడు; లిచ్ఛవులు పాండుజాతులవారు. దేవతాంశసంభూతులు; వేసలిపురము కాంపిల్యనగరము; బ్రహ్మదత్తుఁడే ద్రుపదమహారాజు; బౌద్ధగ్రంథములు పెక్కులు మనకు మఱుఁగున నుండుటచేత మహాభారతములోని రహస్యములుగూడ మఱుఁగున నున్నవి. ప్రాచ్యులుగాని పాశ్చాత్యులలో మఱెవ్వరుగాని తెలుపని విషయములను భగవదనుగ్రహమువలన నేను దెలిసికొని మీకుఁ దెలుపుట సంభవించుచున్నది గావున చదువరు లీనావాక్యముల కాగ్రహముఁ జూపక దయ గలిగి శాంతచిత్తముతోడ నే నీసందర్భమున వ్రాయఁబోవుచున్న వ్యాసములను జదివి సత్యమును గ్రహింపవలయు నని ప్రార్థించుచున్నాను.



# దు రా శ

(చిన్నకథ)

గుండిమెడ వేంకట సుబ్బారావు గారు

సత్యమునకు, ధర్మ ప్రతిష్ఠకును, దగిన
ఫలితము లొసంగుచును, నాల్గు పాదములను
తిరుగ ధర్మంబు, తొలి వంగ దేశమందు
కలఁడు శృంజయుఁడను ధరాఖండలుండు.

కం. ఆ నరపతి సంతాన వి
హీనుండై బంధుజనులహితమున భక్తా
ధీనుండగు నీశ్వరు వర
దానముఁగొనదరిగి ఘోరతప మొనరించెన్.

చం. బహుళతపోనిరూఢి వన
వాటములన్ వసియించుచున్న యా
మహిపతి భక్తికిన్ కరఁగి
మాన్యగుణాలయుఁడైన యా మహా
మహుఁడు శశాంకశేఖరుఁడు
మానవనాథుని ముందునిల్చి తత్
సహజకృపారసంబు పయిఁ
జల్లుచు రాజును బిల్చి యిట్లనున్.

ఆ. "ఓనరనాథ లేంద్ర! యుష్మదీయతపఃప్ర
భావమునకు నే దిగివచ్చినాఁడ
నేఁడ్రి శూలపాణి నీ యిచ్ఛవచ్చిన
వర మొసంగువాఁడఁ బల్కు మనఘ!"

మ. అనుచున్ త్రిజగన్నాయకుండు మది బ్ర
హ్మానంద ముప్పొంగ, న
య్యనఘుం గాంచి నమస్కరించి యిటుల
త్యాత్రంబుతోఁ బల్కె, "నో
కనకాద్రీశ! సువర్ణదేహుఁడయి నా
కన్నంటఁ జల్లార్చు బా
లుని నాకున్ సుతుఁ జేసి నన్ సుఖవిలో
లున్ జేయవే యీశ్వరా!"

ఆ. కలదె యిట్టివింత ఘనగుణాఢ్యుండౌచుఁ
దనరుఁ గీర్తిఁ దెచ్చు తనయుఁ గోర
కకట! స్వర్ణదేహుఁడగు పుత్రు నర్థించె
ప్రభు వదెంత మందభాగ్యుఁడొక్కొ!

కం. అర్థరహితపు విపరీతపు
బుద్ధికిఁ గారణము లేకపోవునొకో? స్వా
ర్థసిద్ధంబైన ధనాశన్
బద్ధుండయి యుండుట నట్టివాంఛ జనించెన్.

గీ. కోరిన వరం బొసంగి పురారి యంత
తని పూజల నంది యదృశ్యుఁడయ్యె
ధరణిపతియు మహానందభరితుఁడగుచు
వరుస డెంచె నిజాస్థానపురమునకును.

ఉ. అంతటఁ గొన్నిమాసముల
కా నరనాథుని రాణివాసశు
ద్ధాంతము సవ్యకాంతులకుఁ
దావలమై విలసిల్ల, నమ్మహీ

కాంతుఁడు కాంచె నిర్మలిన
కాంచనగాత్రుని నొక్కపుత్రకున్
కంతునిఁ గేరువాని! శిలి
కంతుని వాక్యము రిత్త వోవునే!

ఆ. ఆకుమారుఁగాంచి యతులహర్ష మహాబ్ధి
నోడలు మరచి యుండెఁ బుడమి ఱేఁడు.
సుతునికంటె వాని యతిలోకసౌవర్ణ
తనువె తనకు మోదధామమయ్యె!

కం. ఈవిధముగ నాసృంజయ [చుం
భూవిభుఁడు కుమారధనవిభూషితుఁ డగు
జీవనయాత్రను బహుసౌ [డై.
ఖ్యావహముగఁ గడపుచుండె నవ్యాకులుఁ

ను పరమానందములోఁడ నిట్టు లలభూ
పాలుండు నాలైదు వ
త్సరముల్ పుచ్చె ననంతరం బొక నిశీ
థంబందు నాభూతలే
శ్వరు సౌధంబునఁ జొచ్చి రుజ్జ్వలఘనా
శన్ ఘోరపాపక్రియా
నిరతుల్ పల్వురు చోరు లీశ్వరుని ని
శ్రీశంబు సామాన్యమే!

ఆ. గృహముఁ జొచ్చి నాల్గుకెలఁకుల శోధించి
సాధ్యమైనదెల్ల సంగ్రహించి
అచట నచట వెదకి యాచోరవరు లంత
నెడలు పులకరింప నొక్కచోట

కం. కాంచిరి నిద్రారతుఁడై
మంచముపయిఁ బండియున్న మహనీయతనూ
దంచిత తేజస్సాంద్రునిఁ [పుత్రున్
గాంచనమయగాత్రు, మనుజ కాంతుని

గీ. వానిఁగని స్వర్ణవిగ్రహభ్రాంతులగుచుఁ
జోరులంతట నారాజసుతునిఁ బట్టి
లీలఁ గొని పోయి రటఁ బాసి! లేశమేని
యెఱుఁగఁ డీచర్య పాపమాధరణి విభుఁడు!

ఉ. బాలునిఁ గొంచుఁబోయి యొక
పర్వతగహ్వరమందుఁ బెట్టి, యా
కూళలు నాల్గు తున్కలుగఁ
గోసిరి వాని సువర్ణదేహమున్;
కాలవశంబునన్ మనుజ
కాంతుఁడు మక్కువఁ బెంచుకొన్న యా
శాలత లెట్టినిష్ఠురవి
పంపు ఫలంబును గాసె నక్కటా!

ఆ. అసమతప మొనర్చి యార్జించిన సుపుత్ర
భాగ్యరాశి భస్మపటల మయ్యె!
ఆశఁగొల్పి నట్టి యాత్మీయ వంశంబు
నక్కటకట! మరల దిక్కుమాలె!

ఆ. ఆమహేశ్వరుని జరాయురారోగ్యసం
తునిఁ గుమారు నొసఁగు మనక నాఁడు
అకట! స్వర్ణదేహుఁడగు పుత్రు నేటి క
రించె సృంజయుండు తెలివి మాలి!!

కం. ఈ పర్యవసానం బే
శాపంబోకాని, సర్వ సామాన్యమునన్
జూపట్టు నెల్ల యెడలను!
పాపిష్ఠి దురాశ మధురఫలముల నిడునే?

రంగనాథునిసవారంభరంగమునఁజొచ్చి, భాస్కరాదులరామ భక్తిఁ బొగడి
సోమునిమహిమంబునరాచి చేతులుమోడ్చి, కేతనాదులమహాఖ్యాతి కలరి

గీ. ఎంద ఱెందఱుసూక్తు లింకెన్ని యేని, యరసివచ్చు కుమారవిద్యానురక్తి
తుట్టతుదకుఁ గవిత్రయధుర్యభవ్య, దివ్యవాణీ సుధాంబుధిఁ దేలకున్నె!

గీ. విద్యనేర్చుట సదసద్వివేకమునాల, నైన యాముష్మికంబున కనుట సత్య
మైన, నయ్యది ధనమునాలనైన కేవ, లైహికంబున కుపయుక్త మగుచునుండె.

మ. పరసారస్వతసీరధిం దరిచి విద్యావామృతం బాని బా
లురు నిర్నిద్రమతిం బరీక్షలఁ గృతార్థుల్ గాకొకో! కాని యు
క్కరుఁ దెవ్వండయినన్ సహస్రశతసంఖ్యన్ దానిఁ బ్రేమించినన్
బరమార్థంబున కెల్ల వారలయభిప్రాయంబు వీక్షింపుఁడీ!

మ. పురవాసక్రమ మర్థనాశకమనోబుద్ధిభ్రమల్ సైఁచి దు
ర్భరనిర్బంధనిబంధనాంగలకలాభ్యాసంబు గావించుచుం
దురుగాదే యిప్పు డెల్లవారు కులవృత్తుల్ గూడఁ గ్రేడించి దు
ష్కరసేవాకలితాధికారధనభోగఖ్యాతికామంబులన్!

గీ. కాని యౌవనమునుగూర్చి మానసంబు, ధనము భోగంబు సమకూర్చి తనుప్రఁ దనిపి
యులరఁ జేయునుగాన విద్యానురక్తి, యిరుతెఱంగుల నాత్మార్థమే నిజంబు.

క. ఈగతిఁ గౌమారము వడి, నేగఁడిలెటి యౌవనంబు నేతెంచుఁ దనూ
భోగానురక్తి కప్పుడు, లోఁగుదు రెల్లరును గామలోలుపబుద్ధిన్.

గీ. ఇదియె నైసర్గికప్రేమ మెసయునట్టి, నాలుగవమార్పు, దీనిచందం బభూత
పూర్వ, మిదిగాదె లౌకికపూరుషార్థ, కామధామంబు దంపతిప్రేమ మనఁగ.

క. చదువనివారని చక్కఁగఁ, జదివినవారనుచు శంకనలుపక మనఁజాఁ
దుదియని యెంచక యౌవన, పద మెల్లరమదుల నొక్కమాడ్కిఁ గలఁచుఁగా!

సీ. నవనవోన్మేషమానసనారసంబుఁ గొం, దఱ సేయు మస్తదంతావళంబు,
విద్యావివేకపుష్పితబుద్ధివల్లరి, నూఁచముట్టుగ నూఁచునోరుగాలి,
లోకవృత్తాంత మాలోకింప వికసించు, కందోయిబంధించు గాఢతమము,
సర్కథాకర్ణనాసక్తకర్ణములోన, శృంగారమంత్రంబు చెప్పగురువు,
వినయనయధియుక్తిధులార్చు వేడివడగు, కుటిలసాహసవిధిఁ గూర్చు కుంజనేఁడు,
మంచిచెడ్డలు మఱపించు మత్తుమందు, వగుచుఁబొడమూపు వచ్చిన యౌవనంబు.

చ. పాపవిహీన ముగ్ధత పసాయపరీతము నైన ఘోరసం
సారముఁ జొచ్చు జీవి సహజంబుగ జవ్వనమందు దానికిం
గారణ మాశరీరసుఖకాంక్షయె దానికి సాధనం బగుం
గోరినకాంత కాంతునకుఁ గోరినకాంతుఁడు కాంత కబ్బుటల్.

చ. పరిణయనిశ్చయం బనెడిభాగ్యము నాటినయట్టిపత్తులై
కరమును బట్టువేళ మొలకల్ పొడమం జిలునవ్వుచూపులన్
బెరఁగి తలంపు సిగ్గు గనిపించరసోక్తులఁ బూచి యువ్వధూ
వరహృదయానురాగరసవల్లులు కూడికఁ గాచు నేకమై.

సీ. ప్రాణనాయికమేను బంగారుబొమ్మగా, సింగార మొనరించి పొంగువారు
కాంతాంగవల్లరి కాంచనవల్లిగాఁ, గాంచి యానందంబు గాంచువారు
మంజుభాషిణిపల్కు మాధ్వీరసంబుగాఁ, గ్రోలి మైమఱపునఁ దూలువారు
హరిణాంకవదనయపాంగవీక్షారేఖ, తమభాగ్యరేఖగాఁ దలఁచువారు
గీ. పక్వబింబాధరోష్ఠచుంబనఫలంబు, తనువు లెత్తినఫలముగాఁ దలఁచువారు
గాఁగ జాయానురాగసంక్రాంతహృదయు, లగుచు నానంద మొందనిమగలు గలరె?

సీ. భావజాలత్రపాబహుమానవలమాన, దరమానవీక్షణోదరములందు
జీవారుణాధరాంచితలాసనవిలాస, దరహాసచంద్రికోదరములందు
పరకుందవాసనాభాసమానాననమా, దరప్రేమధారణోదరములందుఁ
బహుహాసపరిరంభపరిచితాదరచిత్తా, దరనర్మభాషణోదరములందు
గీ. రూఢగాఢాతిగాఢసంప్రాప్తమగుచుఁ, గానవచ్చెడిస్వీయముగ్ధానురాగ
వల్లరులఁ బెంచునమకూలవల్లభులకు, స్వాదుశృంగారరసఫలాస్వాద మరుదె?

చ. తరుణము వేచి కూర్చుసుఖదాయకభోజనపానశయ్యలన్
సరసవచోవిలాసములఁ జందనచర్చలఁ గమ్మతావిక
ప్పురపు విడెంబులన్ వలపు పొంగఁగఁ దన్పుచు మానినీమణుల్
పతులకుఁ గూర్చుచుండు రసవద్గుణాభరణాభిరామలై.

చ. చెలువము దీర్చు మేల్నగలు చీరలు రైకలు లేకయున్న న
క్మలి మెయి దాల్చి యందమున మించె నొకో యనఁ గొంద ఱంగనల్
చెలువ్రలఁ గూర్మిఁ గాంచి సుఖలీలలఁ దేలుదు రెందు నాథులన్
వలచినభామినీమణులు భాగ్యము భోగ్యము లెన్నఁగొందురే?

కొమరులఁ జూచికొమ్మ మదిఁ గుందకు మన్నను ప్రేమసూత్రబం
ధము మృతపుత్రుతోఁ బితయెదన్ మఱియింత బిగించు కుండునే?

ఉ. తనయుఁడు తప్పదారిఁ బడి ద్రవ్యము దుర్వ్యయ మాచరించుచున్
దన కపకీర్తి తెచ్చె నని తండ్రి మనస్ విసుఁ గెత్తి పోఁడు ద
ప్పిన మఱి చావ నిమ్మనుచుఁ జేరఁగ నీయఁడు కొంప కప్పు డా
చెనఁటికిఁ గీడు మూఁడె నని చెప్పినచోఁ బిత పర్వు లెత్తఁడే?

ఉ. పిల్లలు తీవ్రరోగపరిపీడిత మొందిన వేళ వారిపా
ల్వెల్లను వేంకటేశ్వరున కిచ్చెద మంచును జబ్బు మళ్లినన్
జల్లఘటంబు పోఁతులను జాతర కిచ్చెద మంచు దేవికిన్
దల్లులు మ్రొక్కుకొందురుగదా! కనుఁ డీతపయానురాగముల్.

గాఢప్రేమ

క. ఒకయెడ నాటిన ప్రేమం, బొకలంకము గాఢమును నహార్యము నహజం
బకుటిల మై యొప్పును వె, న్కకు వెంకియుఁ బోదు దానికార్యము గనుఁడీ!

చ. మరణము దాసినంత నొకమానిని భర్తపదంబు లంటి యీ
చరణసరోజసేవ నిహసౌఖ్యము గాంచు ఋణంబు తీఱె నీ
స్మరణమె యింక నాకుఁ బరసౌఖ్య మొసంగెడు నంచు బాష్పసం
భరదనురాగదృష్టిఁ గనసారఁగఁ గన్గొని చేరె నాకమున్.

చ. పరమతిశీలవృత్తిసమభావనమంచితదంపతిద్వయిన్
బరమపదంబుఁ జేరె నెలప్రాయమునం దలసాధ్వి యాసతీ
విరహవిషాదసాయకవిభిన్నమనస్కుఁడు నామెదీర్ఘసం
వరనమునానురాగకలఁ దత్ప్రతిమం గనుచుండు నెప్పుడున్.

చ. ఒకనిజుపేదవాఁడు మృతినొందిన ప్రేయసిదేహ మీయఁగం
బకనముఁ బూడ్చి యం దరుఁగు దీర్చి నిచ్చ గడించుకూలి నిం
చుక నొకపంచు పూలు గొని సూనుని గూడి దినాంతవేళ వే
దికకడ కేగి యం దిడి సతిన్ స్మరియించు నదెంతకూర్మియో!

చ. తరుణవయస్కుఁ డుత్తముఁ డుదారమనస్కుఁ డపుత్రుఁ డర్థసం
భరితుఁ డొకండు సాధ్వి యగుభార్య గతించినయంత పెండ్లియున్
బరిణయ మాడ కాత్మసుఖవాంఛల నన్నిటి ద్రోచిపుచ్చి యా
[illegible]

వానప్రస్థుని, యతిని బోధించును. ఆశ్రమ ధర్మము లీక్రింద నుదాహరింపఁబడినవి.

"చతుర్భిరపి చైవైతే నిత్యమాశ్రమిభి ర్ద్విజైః, దశలక్షణకో ధర్మస్సేవితవ్యః ప్రయత్నతః; ధృతిః క్షమా దమో ఽస్తేయం శౌచమింద్రియనిగ్రహః, ధీర్విద్యా సత్యమక్రోధో దశకం ధర్మలక్షణం; దశ లక్షణాని ధర్మస్య యే విప్రాస్సమధీయతే, అధీత్య చానువర్తంతే తే యాంతి పరమాం గతిమ్." (మనుస్మృతి)

ధృతి, క్షమ, దమము, అస్తేయము, శౌచము, ఇంద్రియనిగ్రహము, ధీ, విద్య, సత్యము, అక్రోధము ననునవి ధర్మలక్షణములు. ఈ దశలక్షణములు గలవాఁ డుత్కృష్టగతి నొందును. ఇవి యన్నివర్ణములవారికి నన్ని యాశ్రమములవారికి నాచరణీయములు. బ్రహ్మచర్యము, సత్యము, తపస్సు, దానము, నియమము, మొదలగు ధర్మాంగములచేత ధర్మ మభివృద్ధినొందును.

"అద్రోహశ్చాప్యలోభశ్చ దమో భూతదయా తపః, బ్రహ్మచర్యం తపస్సత్యమనుక్రోశః క్షమాధృతిః, సనాతనస్య ధర్మస్య మూల మేత ద్దురాసదమ్."

(మత్స్యపురాణము)

అద్రోహము, అలోభము, దమము, భూతదయ, బ్రహ్మచర్యము, సత్యము, అనుక్రోశము, క్షమ, ధృతి మొదలగునవి సనాతనధర్మమూలములు.

"శ్రాద్ధకర్మ తపశ్చైవ సత్య మక్రోధ ఏవచ, స్వీయదారేషు సంతోష శ్శౌచం విద్యా నసూయతా, ఆత్మజ్ఞానం తితిక్షాచ ధర్మ స్సాధారణో నృప!"

శ్రాద్ధకర్మ, తపము, అనఁగా స్నానము, దానము, పూజ, హోమము, జపము, సత్యము, అక్రోధము, స్వీయదారసంతోషము, విశుద్ధత, విద్య, అసూయారాహిత్యము, ఆత్మజ్ఞానము, తితిక్ష మున్నగునవి సాధారణ ధర్మములు.

ఆర్యు లెద్దాని నాచరింతు రదియె ధర్మము. ఆగమవేదులు దేనిని గర్హింతు రది యధర్మ మని విశ్వామిత్రునిమతము.

"యమార్యాః క్రియమాణం వై సంశ స్త్యాగమవేదినః, స ధర్మో యం విగర్హంతి త మధర్మం ప్రచక్షతే."

ధర్మశబ్దమున కిట్టి యర్థములు గలవు. ధర్మశబ్దము సంస్కృతభాషాపదము. గీర్వాణ భాషయం దీశబ్దమున కేయేయర్థములు గలవో యవియన్నియు నాంధ్రభాషలో వ్యవహరింపఁబడుచున్నవి. అతిప్రాచీనమైన ఋగ్వేదమం దిటులు ధర్మశబ్దనిర్వచనము గలదు.

"త్రీణిపదా విచక్రమే విష్ణుర్గోపా అదాభ్య అతో ధర్మాణి" (ఋక్)

పరమేశ్వరుఁ డాకాశమధ్యమున త్రిపాదపరిమితిగల స్థానమును నిర్మించి లోకములు సకలధర్మములను ధరించునటుల నొనర్చుచున్నాఁడు. ఇచ్చట ధర్మశబ్దమునకు జగన్నియామకమైన నియమసమూహ మని యర్థము.

మనుస్మృతి ద్వితీయాధ్యాయమున ధర్మ విచారణ యిట్లు చేయఁబడినది. రాగద్వేషములు లేని విద్వాంసులు సమాజములో నే నియమమును పాలించునో యదియే ధర్మము.

పురాణములయందును శాస్త్రములయందును ధర్మశబ్దమునకనేకార్థము కల్పింపఁబడక భిన్నార్థములు కల్పింపఁబడినవి.

"అహింసాలక్షణో ధర్మో హింసా చాధర్మ లక్షణా" (మహాభారతము)

"విహితక్రియయా సాధ్యో ధర్మః పుంసాం గుణోమతః, ప్రతిషిద్ధక్రియాసాధ్యస్సగుణో ధర్మ ఉచ్యతే" (ధర్మదీపిక)

ఏ కార్యమువలన మానవసమాజమునకు మేలు గలుగునో యదియే ధర్మము. శాస్త్రసమ్మతమగు కార్యాచరణమువలన మంగళమే కాని యమంగళము కలుగదు.

"వేదప్రణిహితో ధర్మో హ్యధర్మస్తద్విపర్యయః" (శ్రీభాగవతము)

వేద ప్రణిహితం ధర్మకర్మ తన్మంగళం పరం" (బ్రహ్మవైవర్తము)

శాస్త్రము—"శిష్యతేఽనేనేతి శాస్త్రం" త్రమనగ శాసనవాక్యము. పుత్రుని మంగమును గోరుచుండు తండ్రి సంతానముయొక్క ల్యావస్థయందు "లాలయేత్ పంచవర్షాణి వర్షాణి తాడయేత్" అను న్యాయమున కుని దండించును. అట్లు లేఋషులు లోకులు ర్మభ్రష్టులగుదురని భావించి శాసనవాక్యము గాని విధివాక్యములనుగాని రచించిరి. ర్మకార్య మాచరించిన బాధ జనించును. దువలన సహజవృత్తికి గౌరవ ముండఁజాలదు. ఎట్టి కార్యమాచరించుటకు సాహసము పుట్టదు. కాబట్టి ధర్మాచరణముకై శాసన వాక్యములు పుట్టినవి. సిపాయిని జూచినగనే భీతిజనించుటలు ధర్మసూత్రములను వీక్షించినంత సాధ్వసము జనించును. అట్టిభయముండకుండిన ప్రకృతియు మానవమునకుఁ దోఁచిన కార్య మాచరించి భ్రష్టమగును. లోకమొక్కటియైనను భిన్నభిన్నమార్గములను బట్టును. ఇట్టిదురవస్థ సంభవించుచునుగదా యని యాలోచించి ఋషులు సత్కార్యము యొక్క స్వరూపము ఫలము సుఖము నొందలగునవి జన్మించునట్లు ధర్మవర్ణనము గావించిరి. ఈ సందర్భమునఁ గొన్ని యుదాహరణము లావశ్యకములు.

"ప్రతిపది కూష్మాండం నాశ్నీయాత్"

ప్రతిపత్తునాఁడు కూష్మాండమును దినఁగూడదు. ఈ నిషేధవిధి ననుసరించి గుమ్మడికాయ తినుటవలన దోషమేమి యని ప్రశ్నించిన "కూష్మాండే చార్థహానిస్స్యాత్" "కూష్మాండభక్షణమువలన అర్థహాని కలుగునని సమాధానమును జెప్పవలయును. ఈ విషయమే తిథితత్త్వమను గ్రంథమున వర్ణింపఁబడినది.

"కూష్మాండే చార్థహానిస్స్యాత్ బృహత్యాం నస్మరేద్ధరిం, బహుశత్రుః పటోలే స్యాత్ ధనహానిస్తు మూలకే"

అందుచేత విధివాక్యములు క్షేమదాయకము లగుటచే వాని నుల్లంఘింపరాదు. నిషేధదివసంబునఁ గూష్మాండమును దినకుండిన నవశ్యము శరీరమునకు మనస్సునకు నుపకారకమగును.

